# ఆంధ్రభూమి

సర్వవిషయములను చర్చించు
సచిత్రాంధ్రమాసపత్రిక.



స్థాపితము ౧౯౩౩.
సాలుచందా 1-8-0.

సంపాదకుడు :
ఆంధ్ర శేషగిరిరావు, బి. ఏ.

సంపుటము : ౪. యువ, మాఘము : ఫిబ్రవరి, 1936. సంచిక : ౫.


## అంతే చాలు

౧

అంతములేని కోరికల యాకలిమంట దహించి వేదనా
స్వాంతునిఁజేయ, హోరున దిశల్ కడు దద్దరిలంగ నిత్య మే
కాంతనిశాంతవేళల తెగంబడి యేడ్చెదు నన్నుఁబ్రోవ దు
ర్దాంతకఠోరనీరవ తిరస్కృతిఁ జూపుచునుందు వర్మిలిన్.

౨

వేగయిఁక్రుంగదీయు నెరవేరని కోర్కెలకేడ్చి యేడ్చి యిం
కీగతినేడ్చు భాగ్యము లభించిన నంతియె చాలునంచు చే
తోగతి నింతసంతసముఁ, దుష్టియు, శాంతియు దాల్చుటెల్ల నీ
రాగకఠోరనీరవతిరస్కృతిహేతువు చేతనే సుమీ!

౩

కమ్మని గంజియో' కడుగో! కాలముఁ బుచ్చుటకిచ్చి, భావనా
ధ్యమ్మున మేలుకీడుల విధం బరయందగు బుద్ధినిచ్చి, సా
ధ్యమ్ములుగాని కోరికల యాపదలంబడకుండ బుచ్చి, ని
త్యమ్మును నీవుజూపుకృప కర్హునిజేయుచు నుంటివీవిథిన్.

౪

కలవు నిరంతరాతిశయకాంతుఁ గుబుల్కొని కాల్చువేళలుఁ,
గలవు నిరాశనొంది నినుగాంచఁగ పర్విడినట్టి యామముల్,
తెలియుము వెల్ల కాని కడుతేలికగా నిను బొందకుండు న
ట్టులతెగ యేడుపించెదు కటుత్వముఁదాల్చిన యట్లు దాఁగుచున్.

౫

ఎప్పటికప్పుడే నను గ్రహించుట కెంచక త్రోసివేసి, పెం
దెప్పరమై విపత్తులను దెచ్చు ననిశ్చితవాంఛనుండి నన్
దప్పుకొనంగఁజేసి, మదిదార్ఢ్యము కల్మి పరీక్షఁ రోసి, నీ
యొప్పిదమౌ పరిగ్రహణయోగ్యునిఁజేయుచు నుంటి వింతకున్.

—బొడ్డపాటి కుటుంబరాయశర్మ, బి.ఏ.

# డాన్ సైమన్ పాటినో

['అదృష్టము' అనుదానియందు నీకు నమ్మకమున్నదా? నమ్మకములేనిచో నిజముగ జరిగి అదృష్టమనునది ఉండితీరినదని చాటు 'డాన్‌సైమన్ పాటినో' అను కోటీశ్వరుని ఈ క్రింది అద్భుత జీవిత వృత్తాంతమును పఠింపుము. అదృష్టమునందు మీకు చెదరని నమ్మకము కలుగును.]

ఇది ముప్పదియేండ్లకుపూర్వపు ముచ్చట. దక్షిణ అమెరికాకు చెందిన బొలీవియా అను దేశము. సముద్రమట్టమునకు పండ్రెండువేల అడుగుల ఎత్తునఉన్న యాండీస్ అను పర్వత ప్రదేశమున ఓరూర్ అను పట్టణము. అచట జర్మనుదేశీయు డొకడు పలుసరుకులమ్ము ఒక చిన్నస్టోరు స్థాపించెను. ఆ స్టోరులో డాన్ సైమన్‌పాటినో గుమాస్తా. గుమాస్తా ఏమిటి? బిల్లుకలక్టరు.

ఆ బిల్లుకలక్టరు ఉద్యోగమునకైనను అతడు వసూలు చేయవలసినది క్రొత్త బిల్లుల పైకముకాదు. పాతబిల్లులపైకము. ఈచావు బాకీల వసూలుపని ఎచ్చటనైనను తలనొప్పి పుట్టించునదే. అందును అది బొలీవియావంటి వలసదేశమున మిక్కిలి కష్టమైనది. అట్టి మిక్కిలి కష్టమైనపనిని నిర్వహింపవలసిన ఉద్యోగమున నియుక్తుడై యున్నవాడు డాన్ సైమన్‌పాటినో.

ఓరూర్‌నకు పెక్కుమైళ్ళదూరమున యున్సియా అని ఒక కుగ్రామమున్నది. ఆగ్రామ పరిసరమున కొన్ని తగరపుగనులుండుటయే ఆగ్రామమునకుగల కొద్దిపాటి ప్రాముఖ్యమునకు హేతువు. ఆ గ్రామవాసియగు వాడొకడు ఓరూర్‌నందలి జర్మన్‌స్టోర్ వానికి పదునేడుపౌనులు బాకీయుండెను. బాకీఉండి చాల రోజులయినది.

ఇప్పుడా పాతబాకీ వసూలుచేయవలసిన బాధ్యత మనపాటినోపై బడెను. యున్సియా గ్రామమునకు పాటినోను పంపుచు జర్మన్ స్టోర్‌కీపరు కఠినాత్కురకలితములగు మాటలతో ఇట్లు ఆజ్ఞయిచ్చెను: 'బాకీ వసూలుచేయక నీవు వట్టిచేతులతో తిరిగి వత్తువా నిన్ను ఉద్యోగమునుండి తొలగించి వైతును.'

ఉద్యోగభంగభయము హృదయమును క్రుంగదీయుచుండగా పాటినో ప్రయాణమైపోయి యున్సియా చేరెను. ఎక్కువ కష్టము లేకుండగనే బాకీదారుని దర్శనము అయినది. కాని దర్శనమయినంతమాత్రమున క్రొత్తగా ఒలుకునదియేమి? బాకీదారు డబ్బుయిచ్చిన గదా పాటినో హృదయభారము తగ్గుట?

బాకీదారునివద్ద ఒక్కపైసా అయినను లేదు. అట్టి స్థితిలో పాటినో హృదయము ఎట్లుండునో సులభముగనే ఊహించుకొనవచ్చును. బాకీదారునకు పాటినో తన హృదయమును విప్పిచెప్పినాడు: 'నేను రిక్తహస్తములతో పోయితినా నా ఉద్యోగమునకు ఉద్వాసనయే. ఏమిదారి?'

ఈవాక్యము బాకీదారుని హృత్పిండమును చిదిపినది. ఎట్లయిన బాకీతీర్చవలెననియే ఆతనికిని తట్టినది. కాని చిత్తమున తలంపు ఉండిన మాత్రమున చేతిలో పైసాలేనప్పుడు ఆతడేమిచేయగలడు? ఆలోచించినాడు. దీర్ఘముగ ఆలోచించినాడు. అనంతరము ఇట్లు చెప్పినాడు: 'ఈపరిస్థితులలో నిన్ను వట్టిచేతులతో పంపుటకు నాకు ఎంతమాత్రమును మనస్కరించుటలేదు. ఈయవలెనని ఎంతగాఢముగ అభిలషించుచున్నను ఇచ్చుటకు నావద్ద పైకములేదు. కావున నాకుగల తగరపుగనిని

మీా స్టోరుయజమాని హక్కుభుక్తములకు దస్తావేజు వ్రాసియిత్తును. దయచేసి దానిని స్వీకరింపుము.'

పాటినో చాలసేపు సందేహించినాడు. వట్టి చేతులతో పోవుటకంటె ఈదస్తావేజు తీసికొని పోవుటయే మంచిది అని నిశ్చయించుకొన్నాడు. లేనిబావకంటె గుడ్డిబావమేలని ఉద్యోగము నిలుపుకొన ఉవ్విళ్లూరుచున్న పాటినోకు తోచినది. ఎక్కడి కక్కడికే వెంకటలక్ష్మి అని అనుకొని పాటినో ఆగ్రామస్థునివద్దనుండి ఆదస్తావేజు తీసికొన్నాడు. ఆరూపముగా ఆత డీయవలసిన పదునేడు పౌనులు ముట్టినట్లుగా రసీదు యిచ్చినాడు.

దస్తావేజుతో ప్రయాణమై తన యజమానికడకు వచ్చినాడు. నాణెముల గళగళవిన కుతూహలపడుచున్న యజమానికి ఈ తెలుపు నలుపు దస్తావేజుకాగితము ఎంతమాత్రమును నచ్చలేదు. మండిపడినాడు. 'పౌనులకు బదులుగా ఎందుకును పనికిరాని తగరపుగనిని గొనివచ్చి నా మొగమునకొట్టుటకు సాహసించితివి. నిన్ను శిక్షించి తీరవలసినదే. కాక పోయినను నీవు వ్రాయించుకొనివచ్చిన ప్రదేశమున తగరము ఎక్కడఉండి ఏడ్చినది? అది వట్టిగొడ్డ్రాళ్ళదిబ్బ. ఆతగరపుగని నీకే ఉండునట్లు చేయుదును. నీ జీతములో ఆ పదునేడు పౌనులును మినహాయించుకొని ఆ తగరపుగనిని నీకే యిచ్చుచున్నాను.' అని యజమాని బొబ్బరించినాడు.

పాపము! పాటినోకు ఆ తగరపుగని పుచ్చుకొనవలయునని ఎంతమాత్రమును ఇష్టము లేదు. ఇష్టములేకపోయినను ఆతనికి తప్పదు. అది యొకశిశుగా ఆ తగరపుగనివచ్చి ఆతని తలకుచుట్టుకొన్నది. అభిలాషలేకయే ఆతడొక తగరపుగనికి యజమాని అయినాడు. మరి ఆ ప్రదేశమెట్టిది? మిట్టపల్లములుగల [illegible]య కరముల కొండప్రదేశము. తగరము ఉన్నదేమో చూచుటకుగాను అక్కడక్కడ గోతులుమాత్రము పెట్టబడియున్నవి. ఆ గోతులలో ఎచ్చటను తగరపువాసనయైన లేదు. మిగిలినతావున ఉండునని ఎట్లునమ్ముట? అట్టి తగరపుగనికి పాటినో అనుకోకుండ అప్రయత్నముగా యజమాని అయినాడు. ఆ గని పదునేడుపౌనులయిన చేయదని జర్మన్ స్టోరు కీపరు తలంచినాడు. ధనవంతుడగు ఆతనికే అది అట్లుండ అతని తాబేదారును అతనిచ్చు జీతముమీాద బ్రతుకువాడును అగు పాటినోకు ఎట్లుండును? జీతము నష్టముమీాద తనకు తగులుకొన్న ఆ తగరపుగని తనను అచిరకాలమున నే ప్రపంచమునందలి కోటీశ్వరులలో నొకనిగా చేయనున్నదని ఆసమయమున ఆతడెట్లు అనుకొనగలడు?

బాకీవసూలుచేయక వట్టిచేతులతో వచ్చినను పూర్తిజీతము పుచ్చుకొని ఉద్యోగము నుండి విరమించుకొని యుండునుగదా అని ఆతడెంతయో విచారించెను. నేలకుపోవునది నెత్తికి రాచుకొంటిమే అని ఆతడెంతయో కించపడెను. ఎంత విచారించినను, ఎంత కించపడినను ఇకలాభములేదు. ఆ తగరపుగనితో తంటాలుపడవలసినదే!

తప్పని సరియైన ఆ తగరపుగని పరీక్షకొఱకు ఆతడు కొన్ని పనిముట్లుకొన్నాడు. 'చేసికొన్న కర్మమురా శంభులింగమా!' అను తీరని విచారముతో పని ప్రారంభించినాడు. అదివఱకే ఉన్నగోతులకు మరికొన్ని గోతులు పెట్టబడినవి. కాని ఎచ్చటను తగరముయొక్క పొలకువగానరాలేదు. విచారముతో పాటినో పాతాళమునకు కుంగిపోవుచున్నాడు.

ఇట్లుండ ఒకనాడు తవ్వటలో తగరము

కనిపించినది. రేఖ బయలుపడినది. దశానాధుడు మళ్ళినాడు. పరీక్షపైని ఆ తగరపుగనితో దొరయుపాటిది అంతవరకు ప్రపంచమున కనుగొనబడియుండలేదని తేలినది.

ఆతడిపుడు వేసివెయ్యనిధనవంతుడైనాడు. అచిరకాలముననే అతనిరాబడి దినమునకు పదునైదువందల పౌనులకు పెరిగినది. దినమునకు పదునైదువందలపౌనులు! ఎంతటిరాబడి! పదునేడుపౌనులజీతపునష్టమునకు తనకు ఇష్టముగా లేకున్నను తనపాలబడిన తగరపుగని వలననే ఆతడిప్పుడు ప్రతి ఐదేసి నిముసములకును పదునేడుపౌనులు ఆర్జించుచున్నాడు. ఒక్కసారి పదునేడుపౌనులు నష్టపడిన ఆ అదృష్టవంతుడు తరువాత ప్రతిఒక్క ఐదేసి నిముసములకును పదునేడుపౌనులవంతున లాభము దీయుచున్నాడు. ఈ లాభముముందు ఆ నష్టము ఎంతకొద్ది పాటిది? అయితే మాత్రము ఈతగరపుగని మొదట తన పాలబడినపుడు పాటినో ఏమాత్రమైన ఉత్సాహము చూపినాడా?

ఇంతకును ఈ కథ అంతయువిని ఆ జర్మన్ స్టోర్‌కీపరు ఏమనినాడో? అతని హృదయగోళమున ప్రలోభము ఎంతగా కుతకుతఉడికినదో? అదృష్టవంతుని పాడుచేయువాడు నిర్భాగ్యుని బాగుచేయువాడు లేడనువాక్యము సత్యసమ్మతమైనదే యనుటకు ఇంతకంటె నిదర్శనమేమి కావలయును? సిరివచ్చునపుడు 'సలలితముగ నారికేళసలిలముభంగి'ని తెలియకుండగనే వచ్చునను ఆర్యోక్తి ఈ వృత్తాంతము చదివినవిూదటనైన నిజ మనిపించుటలేదా?

ఇపుడు పాటినో కోటికిపడగయెత్తిన విత్తవంతుడు. అగుగాక. హఠాత్తుగ ధనవంతులైన ఇతరులవలె ఆతడు ధనమదాంధుడు కాలేదు. తన విత్తమున విశేషభాగ మతడు బొలివియా దేశపు సాముదాయకాభివృద్ధికి వెచ్చించుచున్నాడు.

పాటినో జీవితము మనకు ఒక మహత్తర సత్యమును బోధించుచున్నది: దురదృష్టమని మన మనుకొనజాలు ఒకవిషయమునడిచినను అంతమాత్రమున దానిని మనము విడనాడ కూడదు. దానిని అనుభవమునకు తెచ్చుటకే ప్రయత్నింపవలయును.

ధైర్యముతో ముందునకు సాగిపొమ్ము. కనిపించుచున్న విషయము లెంతయో నిరుత్సాహములుగా నుండుగాక! పుయిలోడవద్దు. విూరేఖ పయలుపడవచ్చును. మీఅదృష్టము కలిసిరావచ్చును. పాటినోరేఖ అట్లే బయలుపడినది. ఆతని అదృష్టము అట్లే కలిసివచ్చినది.

గత ఐరోపా మహాసంగ్రామావసరమున తగరముయొక్కయు, తగరపు రేకులయొక్కయు వెలలు అమితముగా పెరిగినవి. దానితో డాన్‌సైమన్ పాటినో ధనసంపద మిన్నుముట్టినది. ప్రపంచమునందలి తగరపు వర్తకులలో ఆతడు సాటిలేని మేటి అయినాడు. ఫోర్డు మోటారురాజయినట్లే పాటినో తగరపు రాజయినాడు. సమరకాలమున ఆతని రాబడి సంవత్సరమునకు పదిలక్షల పౌనులకు మించినది. స్పెయిన్ దేశపు రాజధానియగు మాడ్రిడ్ నందు స్పెయిన్ దేశపు కొలువున బొలివియామంత్రిగా నాతడు కొంతకాలము ఉండినాడు.

ఆర్థికముగా ఆతని కింతటి ధనసంపద, రాజకీయముగా ఆతని కింతటి ఉన్నతోద్యోగము వచ్చుటకు కారణము ఒకప్పుడు ఆతని ఉద్యోగమును ఊడగొట్టిన ఆపదునేడు పౌనుల తగరపుగనియే.

అదృష్టమగుటచేతనే అది అదృష్టమైనది!

# గర్భస్రావము చేసికొను హక్కు ఉండవలెను

ఏ ఒక్కనాటి దినపత్రికను మనము తిరుగ
వైచినను కని పారవైవబడిన బిడ్డలయు,
బ్రతికియుండగనే పాతిపెట్టబడిన బిడ్డలయు
వృత్తాంతములను వినుచుంటిమి. ఆబిడ్డల
తల్లులు ప్రాయకముగా పట్టుబడుటయు అం
దుతో వారు రచ్చల కీడ్వబడి బహిరంగము
గా న్యాయస్థానములందు విచారింపబడి శిక్షిం
పబడుటయు చూచుచునేయున్నాము. శిక్షలు
ఎంత కఠినముగా నుండుచున్నను ఇట్టి క్రొత్త
కేసులు సంభవింపకుండుట లేదు. ఇందువలన
తేలినసారాంశమేమియనిన సంఘమునతరుణ
వితంతువులసంఖ్య ఇపుడున్నంత హెచ్చుగా
నుండినంతకాలమును ఇట్టి కేసులతో మన
న్యాయస్థానపు రికార్డులు కలుషితములగు
చునే యుండునని.

వితంతువుల గర్భధారణమును సంఘమం
గీకరింపదు. గర్భముధరించినట్లు తెలియబడిన
వితంతువు పతితురాలుగా భావింపబడుచున్న
ది. దురతిక్రమణీయములగు ప్రకృతివాంఛ
లకు లోగకుండుటకు ఆ వితంతువు ఇనుపకచ్చ
డాలుకట్టిన యామెకాదు. సహజముగ గలు
గు వాంఛకులోగి ఆమె కర్మవశమున గర్భ
ము ధరించుచున్నది. అందుతో సంఘము
ఆమెను దుయ్యబట్టుకొనుచున్నది. ఎట్లో సం
ఘమునకు తెలియకుండ తొమ్మిదిమాసము
లునుగ్రమించి బిడ్డనుగని అనంతరరహస్య
రక్షణమునకుగాను ఆ బిడ్డను విడనాడినచో
ప్రభుత్వము ఆమెపై తన శాసనాయుధముల
తో దండెత్తుచున్నది.

సంఘము తనయెడ రాక్షసత్వము వహిం
చినకారణమున ఆమె మాతృహృదయమును
తెగగోసికొని కడపార గన్నబిడ్డయెడల తాను
రాక్షసభావము వహించుచున్నది. సంఘము
నకు వెఱచి ఆమె చేసినపనికి ప్రభుత్వము సంఘ
మును ఏమియు అనక నిస్సహాయయగు
ఆమెపై కాఠిన్యము చూపుచున్నది.

పోనీ ప్రభుత్వము ఆమె ప్రసవించుటకు
పూర్వమే తగువైద్యునిసాయమున గర్భము
విచ్ఛిత్తి చేసికొనుటకు అనుమతించుచున్నదా?
అదియు లేదు. ఏ గర్భము విచ్ఛిత్తిచేసికొను
టకు ఏ ప్రభుత్వశాసనము అంగీకరింపకున్నదో
అదియే ప్రభుత్వశాసనము అదియే గర్భము
వలన గలిగినబిడ్డను విడనాడుటకైన అంగీక
రింపకున్నది. ఏ విధముగచూచినను ప్రస్తుత
కాలమున సంఘక్షేమమునకు గర్భము విచ్ఛి
త్తిచేసికొనుహక్కు వితంతువులకును, బిడ్డలను
గన ఇష్టములేని తదితర స్త్రీలకును శాసనము
ద్వారా ప్రభుత్వమువారు కల్గించుట అవసర
మగుచున్నది.

శాసనములచే గర్భవిచ్ఛిత్తిచేసికొనుటను
ప్రభుత్వమువారు అరికట్టలేకుండుటను సంఘ
చరిత్ర వెల్లడిచేయుచున్నది. ఇపుడు స్త్రీలు
గర్భవిచ్ఛిత్తిని గచ్చాకుపచ్చాకు వైద్యము
లతో గావించుకొనుచున్నారు. ఇదియు అతి
రహస్యముగ జరుపబడుచున్నది. ఈ పరిస్థితు
లలో ఒక్కొక్కప్పుడు తల్లిప్రాణమునకే అపా
యము సంఘటిల్లుచున్నది. అట్లుగాక గర్భ
విచ్ఛిత్తిచేసికొనుట శాసనసమ్మతమై ప్రభు
త్వపు టంగీకారముద్రనుబడయుచో ఇట్టి అపా
యశంకకు ఇంక అవకాశముండకుండును.
సంతానాధిక్యముచే ఇదివఱకే బాధపడుచు
తిరిగి గర్భముధరించిన స్త్రీలును; సుకుమారు

లగుటచే ప్రసూతికష్టమునకు తమ దుర్బలశరీ
రమును గురిచేయభయపడుస్త్రీలును; తమ
గర్భధారణము వెల్లడియైనచో సంఘము
ఎదుట తలయెత్తుకొనితిరుగుటకు వీలులేని
వితంతువులును, భర్తలచే విడువబడినవారును
అగు స్త్రీలును నిరభ్యంతరముగా అట్టి సంద
ర్భములలో నిపుణులగు వైద్యులసాయమునం
దవచ్చును. ఆపరేషనుచేసి గర్భము విచ్ఛిత్తి
చేయుటకు వైద్యులకు ప్రభుత్వానుమతియుం
డుచో ఆ వైద్యులసలహాను అట్టిస్త్రీలు పొం
దుదురు. అవసరమగుచో ఆవైద్యుల శస్త్ర
కళాకౌశల్యమంతయు అట్టిస్త్రీల అనుబా
టున ఉండును.

జన్మనిగ్రహసాధనములగూర్చిన విజ్ఞానము
పేదతరగతిలోని, మధ్యమతరగతిలోని స్త్రీల
కు లెస్సగ తెలియువఱకును ఆయా తరగతుల
యందలి స్త్రీలలో పలువురు తాము కోరని
బిడ్డలను ప్రసవించుటకంటె అపాయశంకగల
పూర్వపు గర్భవిచ్ఛిత్తిమార్గములను బహుళ
ముగా అవలంబించుటకే కృతనిశ్చయు లగు
దురు. ఇట్టి సమయములందు వారు తమ ప్రా
ణములను అనాగరికులు అజ్ఞానరాశులు అగు
మంత్రసానులచేతులలో పెట్టుచున్నారు. తిన
రానిమందులు తినుచున్నారు దానితో ఆగం
డముగడిచి వారు బ్రతికినను వారి ఆరోగ్యము
పూర్తిగ చెడుచున్నది. గర్భవిచ్ఛిత్తి చేసికొ
నుస్త్రీలు రహస్యరక్షణమునచూపు ఆతుర
తనుచూచి మంత్రసానులు—తమకు విద్య,
కౌశలము లేకపోయినను—విశేషధనమును
గుంజుకొనుచున్నారు. ఆరోగ్యదృష్టితో చూ
చినను, ఆర్థికదృష్టితో చూచినను ఈ పద్ధతి
శోచనీయమైనదిగనేయున్నది. కావుననే నేను
ఇతరవిషయములందువలెనే ఇట్టి విషయము
లందుకూడ స్త్రీలకు నిరభ్యంతరముగా వైద్య
సహాయసౌకర్యములభించు అవకాశము ప్రభు
త్వమువారు కలిగింపవలయుననికోరుట.

ఆరోగ్యభంగభయమునగాని, ప్రతిష్ఠాభంగ
భయమునగాని, దారిద్ర్యభయమునగాని ఏ
స్త్రీయైనను తనకు సంతానమక్కఱలేదని
భావించుచో ఆమె వైద్యునిసాయమున తన
గర్భమును విచ్ఛిన్నముచేసికొనగలుగు హ
క్కును పొందియుండవలయును. కోరబడని
బిడ్డ సుఖవంతమగుబిడ్డ కాజాలదు. పేదతన
ము, తఱుచుకాన్పులు, మితిమీరినపని వీనితో
క్రుంగిపోయినతల్లి బిడ్డను లెస్సగ పెంచజాల
దు. లెస్సగ పెంచబడని బిడ్డ పెరుగుటవలన
సంఘమునకు గలుగగల లాభమేమి? అతడు
వాంఛింపదగిన పౌరుడగునా? ఇది సంసార
స్త్రీలవిషయము. ఇక వితంతువులు, భర్తచే
విడువబడిన స్త్రీలు గర్భవిచ్ఛిత్తిచేసికొనజాల
మిని పుట్టినబిడ్డలను చంపు పాతకులు అగుచు
న్నారు. ఏ విధముగ చూచినను వైద్యులచే
గర్భవిచ్ఛిత్తి చేయించుకొనుహక్కు స్త్రీల
కుండుట సంఘక్షేమమునకైనదనుట నిశ్చయ
మగుచున్నది. మన శాసనసభాసభ్యులు ఈ
విషయమై శ్రద్ధపెట్టుదురుగాకయని కోరెదను.

—బి. వెంకటలక్ష్మమ్మ.

[నేటిసంఘమర్యాదకు విరుద్ధములైన అభిప్రాయములతో ఈ వ్యాసమునిండియు
న్నది. ఇందలి పెక్కు అభిప్రాయములతో మేము ఏకీభవింపజాలకున్నను తాను అవసరమని
నమ్మిన అభిప్రాయములను నిర్భయముగ వెల్లడించినందులకు ఈవ్యాసకర్త్రిని అభినందించు
చున్నాము. ఈ విషయమై కొంత చర్చకు అవకాశమీయగలము కావున ముఖ్యముగ సోదరీ
మణులు పాల్గొనవలసినదిగ కోరెదము.

—సంపాదకుడు.]

# ప్రేమరుచి తెలిసిన స్త్రీ సాహసము

రచయిత:
పురాణం కుమార రాఘవ శాస్త్రి, బి. ఏ.

[గత సంచిక తరువాయి.]

అతి జాగ్రత్తగా ఆప్వంగరాన్ని తీసి జాకెట్టులోపలవున్న బాడీలోకి జొనిపి హృదయం దగ్గరకు చేర్చింది. అమనుల్లా అది కనిపెట్ట లేదు.

ఆరుగంటలౌతుంది అప్పటికి. పదింటికల్లా ప్రకాశాన్ని కలుసుకోవాలి పోయి. ఈ నాలుగుగంటలకాలంలో ఎల్లాగైనా అమనుల్లాను వదలించుకునే ప్రయత్నంచూడాలి. కోపపడితే లాభంవుండదు. తిన్నగా ప్రేమనటించి అతన్ని మైమరపించి వెళ్ళిపోవాలి. అందుకోసం నాటకం ఆరంభించింది; కాస్సేపు అక్కడ నిలువుటద్దంముందు ముంగురులు సవరించుకుని చిరునవ్వుతో అతనిదగ్గరకువచ్చి అతని నిర్దయాశ్లేషముతో అసహ్యం చూపకుండా అన్నది: 'అమన్! నీవు వింతమానిసివి సుమా. మళ్ళీ ఇలావస్తావనుకోలేదు నేను. ఇప్పటి నా ఆనందం తెలుసుకోలేకుండా వున్నాను.'

ఆమాటలతో చాలవరకు నిద్రవచ్చింది అమనుల్లాకు. 'హైదరాబాదులో నీ ప్రవర్తనబట్టి నీయెడల నా కనుమానంగానే వుందిసుమా, మధూ!' అన్నాడు.

'అమన్! అది నీస్వభావం; అంతేగాని నిన్ను నేను మరువగలనా.' అంటూ అతని చెంపకానించింది తన చెక్కిలి.

తరువాత మధు తన దుస్తులు మార్చుకుని పక్కా మొగల్ ఫేషన్‌లో గైచేసుకుంది. రెచ్చిపోయిన కామోద్రేకంతో అమనుల్లా ఆమెను మళ్ళీ సందిట పట్టుకున్నాడు.

ఆముద్దులూ, ఆనొక్కటాలూ అన్నీ ప్రకాశంమీది ప్రేమచేత సహించింది మధు. ఆమె హృదయంలోమాత్ర మా మహమ్మదీయుని యెడల ద్వేషం, కోపం అన్నీ ద్విగుణీకృతమౌతున్నవి.

'అమన్! ఈదుస్తులు నీకోసమే ధరించాను' ఆమె వయ్యారం చిలికింది.

'సెబాస్, మధూ! నీవు నారాణివి.'

'అమన్, నేనిప్పుడే కొత్తపేటలోవున్న మానాన్నదగ్గరకు వెళ్లి పదిగంటలకు సరిగ్గా తిరిగి వస్తాను. తరువాత మనము సినీమాకు వెళ్ళి వచ్చి ఇక్కడే యీరాత్రి గడుపుదాం. ఎవరూ వుండరిక్కడ; మనమిద్దరమే. వెళ్ళిరానా? మరోసారి ముద్దుపెట్టుకో నన్ను.'

౫

కొత్తపేటలో తండ్రిగారింటి ముంగు బండిదిగి లోపలికెళ్ళింది మధు. గంగాధరనాయుడు తనగదిలో ఒక కుర్చీలోకూర్చుని యున్నాడు. కూతురునుచూచినప్పు డతని కన్నులలో నేవిధమైన ప్రేమా తొణుకాడలేదు. తన జీవితమాధుర్యం దొంగిలించి లేచిపోయిన ఆ నిర్భాగ్యురాలి (తనభార్య) ప్రతిబింబమును వలె ఆమెను చూచాడు.

మధుమాత్రం ప్రేమతో, గౌరవభావం చూపుతూ తండ్రిని పలుకరించింది. అయన కుశలప్రశ్నలతో ఆమె వుత్సాహాన్ని తెగ గొట్టేశాడు. చివర కామె ప్రకాశం గుణగణాలు వర్ణించి, తా నతన్ని పెండ్లి చేసికోబోతున్నాననీ, అతని తల్లిని చూడ్డానికి ఇందిరాపురం పోతున్నాననీ చెప్పినప్పు డాయన కొంచెం కదిలేడు.

'నిజమేనా ? నేను నమ్మవచ్చునా ?' అన్నాడు.

'పూర్తిగా నమ్మొచ్చు. ప్రకాశం చాల మంచివాడు. నేనతన్ని వివాహమాడుతాను. నేనిన్నాళ్ళనుంచీ కోరుతూన్న జీవితసౌఖ్యం దొరికింది—మీరు నన్నీవిధంగా చిన్నప్పటి నుంచీ ఉపేక్ష సేయకుండా వుంటే—'

'గంగాధరనాయుడు తల కొద్దిగా ఊపేడు. 'సరే, మధూ! నీవు ఆతల్లి కూతురువనే సంగతి నేను మరచిపోయేటట్లు ప్రవర్తించు. సంతోషిస్తాను. నీకు కావలసిన డబ్బు తీసికొని వెళ్లు.' అన్నాడు.

తరువాత పదినిముషాలకు మధు 'వెల్‌కం హోటలు'లో ప్రకాశం కౌగిలిలో యిముడి వుంది. ఇంకో పదినిముషాలకు గుంటూరు పొలిమేర దాటిపోయా రిద్దరూ.

పదకొండుగంటలవరకూ అమనుల్లా మధు కోసం చూచి, చూచి, ఎంతవరకూ రాక పోవడంచేత ఆమె తన్ను మోసగించిందని తెలిసికొని వుంటాడు.

## ౬

వారంరోజుల తరువాత :

ఇందిరాపురంలో ప్రకాశం నివసించే యిల్లు చాల అందంగా ఉంటుంది. మధు ఆనాగుదయం తనకోసమని ప్రత్యేకింపబడిన గదిలో 'టేబిల్' ముందు కూర్చుని ఒక యుత్తరం వ్రాస్తున్నది. అప్పుడప్పుడు తలెత్తి అక్కడ కిటికీలోనుంచి చూచినప్పుడు పచ్చని పొలాలూ, మరీ దూరానవున్న కొండలూ, ఆమెకు కనుపించుతవి.

ఉత్తరం వ్రాయడం ముగించి, ఒకసారి సాంతంగా చదివింది.

"ప్రియమైన తండ్రిగారికి—నాకిక్కడ లభ్యమైన సౌఖ్యమూ, ఆనందమూ మీకు తెలియజేయడమే ఈవుత్తరముయొక్క ఉద్దేశము. ప్రకాశమూ, పండు ముసలిదైన అతని తల్లీ నాపట్ల మిక్కిలి అపేక్షతో వున్నారు. నేను వారింట అడుగుపెట్టిన రోజు ఆ ముసలితల్లి నన్ను కౌగలించుకుని 'అమ్మా నిన్ను నా కొడుకునువలెనే ప్రేమిస్తున్నాను' అన్నప్పుడు నాకామెయెడల పూజ్యభావం కలిగింది.

ప్రకాశం చదువుకున్నవాడనీ, మంచి వుపకారియనీ, మీదు మిక్కిలి ధనవంతుడనీ మంచి పలుకుబడివుంది గ్రామంలో. ఇచ్చటి భూములన్నీ చాలమట్టుకు అతనివే. దేశము తిరిగియున్నవాడవడముచేత క్రొత్తపద్ధతుల మీద స్వంతముగానే వ్యవసాయము సాగించవలెనని అతని అభిలాష. అతన్ని పెండ్లాడి, అతని జీవితభారం పంచుకోవడం నేను కోరతగిందిగా వున్నది.

వచ్చే లక్ష్మివారంనాడే మావివాహం. అంటే సరిగ్గా నేటికి వారంరోజులున్నది. మీరు తప్పక ఆనాటికి రావాలి; లేకపోతే నా సంతోషమునకు కొరతకలిగిందన్నమాట. నా యెడల మీకుగల పూర్వపు నిరసనభావం పురస్కరించుకుని, నాకోరిక వమ్ముచేయవద్దు. మీరు నమ్మండి; మూడునెలల క్రితం మిమ్మ

ల్ని వదలి లేచిపోయిన ఆ మధు చచ్చిపోయింది. ఇప్పుడు నేను కొత్తమధును. ప్రేమ నన్ను పూర్తిగా మార్చివేసింది.

ఇక విరమిస్తాను. మీరు తప్పక రావాలి నాప్రార్థన మన్నింతురని నమ్ముతున్నాను.

మీ ప్రియమైన కూతురు,
మధు.''

ఉత్తరం మడిచి కవరులోపెట్టి చిరునామా వ్రాసి 'పోస్టాఫీసు'కు పంపించేసింది. అప్పటికి ఉదయం ఎనిమిదిగంటలుకూడా కాదు. గతరాత్రి వర్షముకురిసి యుండుటచేతా, ఇంకా ఆకాశాన మబ్బులావరించుకుని యుండుటచేతా సూర్యుడెక్కడా కనుపించడం లేదు. చల్లగావుంది. అందుకని యొకసారి తమ పొలాలకేసి వెళ్ళి చూచి వద్దామనుకున్నారు మధూ, ప్రకాశం. కనుకనే ఉత్తరం ముగించి దుస్తులు మార్చుకుని ప్రకాశం గదిలోకి పోయింది మధు.

కాని తలవని తలంపుగా ప్రకాశం వేరే పనిమీద మరోచోటికి పోవలసి వచ్చింది. జబ్బుగావున్న స్నేహితుడొకడు తన్ను చూచి పొమ్మని కబురంపేడు.

'మధూ! నీవొక్కదానివే వెళ్ళిచూచిరా. మన ఒంటెద్దుబండి రామస్వామి తోలుతాడు. ఒకగంటలో వచ్చి అక్కడ నిన్ను కలుసుకుంటాను' అని చెప్పి తాను వెళ్ళిపోయ్యాడు.

రోడ్డుప్రక్కన బండీ ఆపి ఒక చెట్టుక్రింద చుట్టకాల్చుకుంటూ కూర్చున్నాడు రామస్వామి. మధు ఉత్సాహంతో, పొలాల్లోకి ఒంటరిగానే పోయింది. కంటికి కింపుగొల్పుతూన్న ఆపచ్చటిచేలూ, అందు వీస్తున్న చల్లనిగాలీ, ఎంత ఆనందమును గొల్పుతున్నవి. 'ఈభూములన్నీ నావికదా!' అనుకున్నప్పుడామె హృదయం ఎంతగా పొంగిపోయింది!

అప్పుడాప్రశాంతనిశ్శబ్దంలో అతిక్రూరముగనున్న ఆవెడగునవ్వు ఎక్కడిది! మనుష్యమాంస మారగించి రాక్షసుడుచేయు విజయసూచకధ్వానమా? అదరిపడి వెనుకకు తిరిగి చూచింది మధు. సంతోషముతో అమనుల్లాయే వస్తున్నాడామెవైపు. మధు నిశ్చేష్టురాలై నిల్చుంది. ఈ దుర్మార్గుని బారినుండి తప్పించుకునే వుపాయమే లేనట్లున్నదే

'మధూ! నన్ను మోసగించడమొక తేలిక పననుకున్నావు కాబోలు నీవు. నాకెంత దూరముగా పోతూంటావో నేను నీ కంత దగ్గరౌతుంటాను. తెలిసిందా?' అని సగర్వంగా పలుకుతూ చేరువకు వచ్చాడు.

మధుకు మాటరాలేదు. అమనుల్లా అన్నాడు: 'మీ తండ్రిగారి వద్దనుంచి నీ అడ్రస్ తెలుసుకోవడము నాకంత కష్టమనుపించలేదు. నిన్నుగురించి యొక అబద్ధపుకథ ఆయనకు చెప్పి నమ్మించాను. దానితో ఆయనకు నీయెడల అసహ్యంకలిగి నాద్వారా నీకొక సందేశం పంపేడు. ఇకనెప్పుడూ ఆయనకు నీముఖంచూపవద్దని శాసించాడు. ఆయన సంరక్షణ వుండదిక నీకు. నాతో వచ్చేయవలసిందే. ప్రకాశాన్ని పెండ్లిచేసుకోవడమనేది నాప్రాణముండగా జరుగదు.'

'నీ వతినీచముగా ప్రవర్తించ గలవు. నిన్ను చూస్తున్నకొలదీ నాకసహ్యం కలుగుతూన్నది. తక్షణమే ఇక్కడనుంచివెళ్ళిపో.' అని ఆమె అన్నది.

మళ్ళీ ఒక వికటహాసంచేశాడు అమనుల్లా ఆమె నడుముచుట్టూ చెయిపోనిస్తూ.

తీవ్రమైన కోపోద్రేకం కలిగింది మధుకు. 'ఆపు నీ దుర్మార్గపునవ్వు.' అంటూ బలము కొద్దీ లాగికొట్టింది అతని చెంపమీద. తన పోషణక్రింద వుండేవాడు ఎదిరించినప్పుడు యజమానికి వచ్చినంతకోపంవచ్చింది అమను ల్లాకు. అప్పుడు వాళ్ళిద్దరకూ ఒక చిన్న ద్వంద్వయుద్ధం జరిగింది.

మధు అమనుల్లాతో ఎదుర్కో-వడం కొం డతో ఢీకొనడమన్నమాట. ఇనుపగోడవంటి అతని శరీరానికి ఉక్కు-గొలుసులవంటి అతని బాహువులచేత ఆమె బంధింపబడింది. చివర కామెను నెట్టేశాడు.మధు క్రిందపడ్డది పాపం. చీరంతా మట్టికొట్టుకుంది- మోచేతికి గాయం తగిలింది.

తిన్నగా సర్దుకుని లేచింది మధు.

'ఇప్పుడు నాక్రూరత్వములో నీ కనుభూత మైంది అణుమాత్రం. నీవు నాకోపకారణ మైతివా నీ యెముకలు నులిమివేయగలను. ఇప్పటికైనా నేను చెప్పినట్లు వింటావా? నీవు నాదానివి. నాసొత్తును దక్కించుకునే శక్తి వుంది నాకు. అందుకు ప్రకాశాన్ని చంప వలసివచ్చినా వెనుదీయను.' ఈమాట లం టూన్న అమనుల్లాను ముఖంలోకి చూడలేక పోయింది ఆమె.

'ఇంకోసంగతి. నేను శిస్తువసూళ్ళకోసం మాపల్లెటూరు వెళ్ళినప్పుడు హైదరాబాదు నుంచి నీవు నాకు కొన్ని వుత్తరాలు వ్రాశావు; జ్ఞాపకమున్నదా ? నీకు నాపైగల అప్పటి ప్రేమ కట్లెములుత్రెంపుకుని ప్రవహించింది వాటిల్లో. ఆవుత్తరాలు ప్రకాశంచూస్తే నీ గతేమాతుందో ఊహించుకో.'

'ప్రకాశానికి నాపూర్వచరిత్ర అంతా తెలుసును.'

'అతడు తృప్తిపడ్డా లాభంలేదు. ఈవుత్త రాలవల్ల నీ-నా-సంబంధం బయలుపడ్డప్పుడు ఈ గ్రామంలోవాళ్లు తలకొకమాట అంటా రు. ప్రకాశం అందిరినోళ్లా పడతాడు. అంత అవమానానికి వేరువిత్తువైన నిన్ను తప్ప కుండా ఏనాటికైనా నిరసిస్తాడు.'

'అట్టిరోజు రాదు. ప్రకాశం ప్రేమలో నాకు విశ్వాసం వున్నది.' అలాగన్నదేకాని మధుహృదయంలో కలతగానే వున్నది. లేడి వలె దిక్కులు పారచూస్తూ నిల్చున్నది.

ఒకఫర్లాంగు దూరాన రోడ్డుమీద నడచి వస్తూన్న ప్రకాశం కనుపించాడామెకు.అప్పు డామె త్వరగా అమనుల్లా ప్రక్కకువచ్చి 'అమన్! అదిగో ప్రకాశం ఇటేవస్తున్నాడు; నీవు దబ్బున వెళ్ళిపో' అన్నది.

'సరే, ప్రకాశంతో నాకు రాత్రి ఎనిమిది గంటలవరకూ పనిలేదు. ఆలోపుగా నీవువచ్చి యూరి చివరఉన్న సత్రంలో నన్ను కలుసు కోవాలి. నీవు రాకపోతే నేనేవస్తాను నీ కోసం.'

'వెళ్ళిపో దబ్బున'

'నీవురాకపోతే నేనే వస్తాను. తెలిసిందా?'

'వస్తాను; వెళ్లు.'

అమనుల్లా కనబడకుండా వెళ్లిపోయిన కొంతసేపటికి ప్రకాశం వచ్చాడు. మధును చూచి ఒంటరిగా పంపినందుకు చాల నొచ్చు కున్నాడు. ఒక కుక్క తన్ను వెంబడించిరాగా పరుగెత్తుతూంటే రాయితగిలి క్రిందపడ్డానని చెప్పింది మధు.

'అయ్యో, చూడు నీమోచేతి కెంత గాయంతగిలిందో. ఇక నింటికిపోదాం. చాల అలసిపోయ్యావు; నాభుజముపట్టుకుని నడు.' అంటూ ప్రకాశ మామెదగ్గరిసా వచ్చాడు.

మధు కెందుకో పొంగిపొంగి వచ్చింది దుఃఖం. ఆమె కన్నీళ్ళతో అతని వక్షోభాగమంతా తడిసింది.

## ౭

ఇంటికిపోయిన తరువాత మధుకు తగిలిన గాయాలకు వేసేటందుకు మందుకోసం బీరువా తెరిచాడు ప్రకాశం. అందులో ఒక పిస్తోలు కనుపించింది మధుకు. దాన్ని ఆమె తదేక దృష్టితో చూచింది కొంతతడవు. ఆపిస్తోలే ఒకగంట క్రితం తనచేతిలో వున్నట్లయితే!

మధ్యాహ్నం ప్రకాశంతో కలిసి భోజనం చేసిన తరువాత మేడమీది గదిలో ఒంటరిగానే పడుకుంది మధు. నాటిప్రొద్దున అమనుల్లాతో జరిగిన రంగమంతా కన్నులకు కట్టినట్లుగా అగుపించింది. ఆ క్రూరమృగము చేతిలో తా నీవరకనుభవించిన బాధ చాలదూ' ప్రకాశంగృహంలో తన కికముందను భూతము కానున్న సౌఖ్యమునుంచి దూరముగా ఎత్తుకుపోవడానికి మళ్ళీవచ్చాడు.

భయవిహ్వలమైంది ఆమె చిత్తమంతా. అమనుల్లాతో తనకు జరిగిన సంభాషణ ముక్కకు ముక్కా జ్ఞాపకం తెచ్చుకుంది. అతడు తన్ను వదలుకుని వెళ్లుతాడన్నమాట కల్ల.

అయితే ఏంచేయాలి? ఆమెకు నిస్పృహ కలిగింది. వెంటనే బీరువాలో చూచిన పిస్తోలు జ్ఞాపకానికి వచ్చింది.

ఔను దానితో అతణ్ణి చంపేయాలి. అదే తన స్వేచ్ఛకుమార్గం; అదే తాను ప్రేమించిన వ్యక్తులను కాపాడే విధం.

అయితే, తనసంగతి? అట్టి హత్యవలని పర్యవసానం తనకు బాధాకరం కాకుండా వుంటుందా?

గుండ్రముగా అనంతముగా తిరుగసాగింది ఆమె మనస్సు. భయంకరపథంలో సంచరించుతూన్న ఆలోచనలు!

భూతమూ, వర్తమానమూ ఆమెకన్నుల ముందు చీకటీ, వెలుగూవలె ఒకటి తరువాత ఒకటి తిరుగసాగెను. ఆమె మనోగోచర మయ్యారు: తన ప్రేమ నిధానమైన ప్రకాశమూ—ప్రేమరూపమైన అతని తల్లీ—తన తండ్రీ—చివరకు భయంకరరూపంతో అమనుల్లా.

ప్రకాశాన్నీ—అతని తల్లినీ—వాళ్ళయింట్లో సౌఖ్యదేవతనూ కాపాడాలంటే తానను సరింప వలసినది ఒకటేత్రోవ- అది తమసావృతము; భయంకరము-

సాయంత్రపు భోజనమునకు మధును పిల్చుకపోయేటందుకు ప్రకాశం వచ్చినప్పు డామె ప్రశాంతముగనే పడుకుని యుండెను- అప్పు డతన్ని బహుమృదువుగా కౌగలించుకుని ప్రేమచిలుకుతూ అతని కళ్ళల్లోకి చూచింది మధు- తానేదో చేయబోతున్నానని, దాని పర్యవసాన మెల్లాగుతేలినా ప్రేమతో తన్ను క్షమించమనీ, ఒక ప్రార్థనా పూర్వకమైన ముక్తసందేశము చెప్పుతున్నవామె నేత్రాలు.

'మధూ' నీముఖ మంతా పాలిపోయింది, డాక్టరును పిలుస్తాను.'

'వద్దు. నాకారోగ్యముగానే యున్నది-' తన చిరునవ్వు పెదవులు అతని నోటిదగ్గరకు తెచ్చింది-

'మా అమ్మ నీస్థితి విని చాలవిచారపడ్డది- నిన్ను చూడ్డానికి మూడుసార్లు వచ్చిందిట- నీవు నిద్రపోతూంటే మళ్ళీ వెళ్ళిపోయిందిట-'

'నేను నిద్రపోతున్నానా- అమ్మను నన్ను క్షమించమనిచెప్పు- ప్రకాశ్, ఈసారి ఒంటరిగా వెళ్ళినప్పుడు జాగ్రత్తగా వుంటాను.'

'సరే, ప్రశాంతంగా పడుకో- నీభోజనము పైకి పంపిస్తాను.'

అతడు వెళ్ళుతూంటే మళ్ళీ పిలవాలనుకుంది మధు. చివరసారిగా ఒక కొంతసేపు అతన్ని తనదగ్గరే వుంచుకోవాలని ఆమె కోరిక- కాని ఎట్టకేలకు ఇప్పుడు టైమెంతవుతుంది అనిమాత్రం పలుకరించింది.

భోజనాలు త్వరగానే ముగిసినవి. అప్పటికే ఏడుగంట లవుతుంది- ఇంకొక్కగంటలో మధుపోయి అమనుల్లాను కలుసుకోవాలి- తప్పదు, తానుప్రేమించిన యతనికోసం——

మధు లేచి కూర్చుని ప్రకాశానికొక ఉత్తరం వ్రాసింది- 'ప్రియతమా'——నేను చేస్తూన్నపని నాకు విచారకరంగానే వున్నది- అయినా, నేనొకగొప్పతప్పుచేసియున్నాను; నేను నీకు తగిందాన్ని కాను- ప్రకాశ్! నేను మళ్ళీ తిరిగిరాను- నీవు నన్ను క్షమించలేక పోయినా, మరచిపోయన్నా సుఖంగావుండు-

నీ మధు-'

ఆ చిన్న ఉత్తరాన్ని మడిచి తలగడక్రింద పెట్టేసింది. మరునాడుదయం ప్రకాశం దాన్ని చూడగలడు-

కొంతడబ్బూ, అవసరానికి కావలసిన కొన్ని వస్తువులూ ఒకచిన్న సంచీలో పెట్టుకుని బయలుదేరింది మధు- మేడమీదనుంచి క్రిందికిదిగివచ్చి ప్రొద్దున బీరువాలోచూచిన పిస్తోలును వణుకుతూన్న చేతులతో తీసికుని సంచీలో పెట్టేసుకుంది- తలుపుదగ్గర ఆగి ప్రకాశంగదిలోనుంచి మాటలు వినుపిస్తూంటే చెవియొగ్గింది-

'ఔను, అమ్మా! ప్రొద్దుటికంటె కొంచెం కులాసాగానే వుంది. ఈరాత్రి పూర్తిగా నిద్రపట్టుతే రేపు వుదయానికి బాగా తేలిక యిస్తుంది-'

'ఆ అమ్మాయిని గురించి మనం శ్రద్ధ తీసికోవాలిరా- ఆమె మనయింటికి రత్నదీపం వంటిది-'

మధుకు ఒక్కసారిగా కన్నీళ్లు క్రమ్ముకున్నయి- తలుపుతీసికొని వీధిలోనికి వచ్చేసింది- నిస్పృహతో నిండిపోయిన ఆమె హృదయంలో ఒకటే ఆశాకిరణం వుంది.

ప్రకాశంయెడల ప్రేమా, అమనుల్లా పట్ల అసహ్యమూ——ఆ రెండు భావాలూ సుడిగాలులై ఆమె నా అంధకారములో తీసికుని పోతున్నవి-

అవియే తన జీవితములోని చివర నిముషాలని పూర్తిగా నమ్మిందామె-

౮

నాలుగైదు కొవ్వువత్తి దీపాలు వెలిగించుకుని ఆ పాడుబడ్డ సత్రంలో అటూయిటూ పచారుచేస్తున్నాడు అమనుల్లా- తలుపులు తెరచినట్లు చప్పుడైనవి- 'మధు వచ్చినట్లున్నది- రాకేంజేస్తుంది?' అనుకున్నాడు-

కాని మరుక్షణమే అతని ముఖవైఖరి అదోకరకంగా మారిపోయింది- సరిగ్గా తన గుండెకేసి గురిపెట్టి పిస్తోలు చేతపట్టుకుని నిల్చున్నది మధు తలుపోరగా గోడకానుకుని నిల్చుని-

ఆమె కంఠము తొణుకులేకుండా నిర్భయంగా సాగింది: 'అమన్! నేను చెప్పినట్లుగా నీవు వినవలసిన సమయమిది. ఇప్పుడు నేను నీకు రెండుమూడు విషయాలు చెప్పవలసి వున్నది; కూర్చో అక్కడ.'

పిస్తోలుకేసి చూస్తూ వెనుక కొక అడుగు వేసి క్రింద కూలబడ్డాడు అమనుల్లా కిక్కురు మనకుండా. అత డామె ఆజ్ఞాబద్ధుడవడ మదే మొదటిసారి.

'నేను ప్రథమంలో నిన్ను కలుసుకున్నప్పుడు నాకు మతిలేదు. నాక్షేమమైనా ఆలోచించుకునే వివేకం లేకపోయింది. ఆరోజులు—సిగ్గు భిడియములు విడిచి నీతో స్వేచ్ఛగా సంచరించిన యారోజులు తలచుకుంటే నా శరీరంమీద తేళ్లుప్రాకినట్లున్నది. నీవు నన్నొక నరకకూపంలో వుంచావు. అందుండి ఈనాటికి ఉద్ధరింపబడ్డాను ఒక మహత్తరమైన—'

ఉద్రేకపూరితమైంది ఆమెకంఠము. తేజోవంతములైన ఆమె కన్నులు సూటిగా అతని ముఖంలోకి చొచ్చుకు పోతున్నవి.

'ఔను. ఒక మహత్తరమైన ప్రేమశక్తి చేత. పశువా' నీకు ప్రేమంటే ఏమి తెలుసును? తుచ్ఛవ్యామోహమే నీ ఆకారము.

సరే, జరిగిందేదో జరిగింది. గతమంతా కాలప్రవంతిలో కలసిపోయింది. నేనిప్పుడు వేరేమధును. నన్ను తనసర్వస్వముగా చూచుకునే ఒక పుణ్యపురుషుని నేను ప్రేమిస్తున్నాను. అతని ప్రేమకు పాత్రురాల నయ్యేటందుకు ఎంత సాహసానికైనా వెనుదీయని ధైర్యరూపమైన మధు నీ యెదుటనిల్చున్నది. అమన్ ! నీవొక మృగానివి. నా—నా ప్రియతముల హృదయాల మధ్య అడ్డుగావున్న ఆవుత్తరాలు నీదగ్గరవున్నవి. అవి నాకిప్పుడు కావాలి. మాయెడల ప్రయోగించడ నికి నీకు గల ఆయుధాలవి. వాటిని వెంటనే ఇచ్చివేస్తావా? పిస్తోలు పేల్చనా ?'

అమనుల్లా తన నాలుకతో పెదవులు తడుపుకుంటున్నాడు. పరిస్థితు లిల్లాగు మారిపోతవని అత డనుకోనేలేదు. 'మధూ, ఏమిటీ అనాలోచితమైన జబర్దస్తీ. నన్నుచంపి నీవు క్షేమంగా పోలేవు. ఉరిత్రాళ్ళకొసన ప్రేలాడుదువు.'

'ఆవుత్తరాలు నీదగ్గిర వున్నంతకాలమూ నేను బ్రతికి యుండవలసిన అవసరమేమీ కనుపించడము లేదు. అధికప్రసంగము కట్టిపెట్టి ఉత్తరాలు తెచ్చియ్యి.' అన్నదామె.

'వాటితో ఏమిచేస్తావు?'

'తగలపెట్టుతాను.'

'ఇక్కడే!'

'ఎక్కడైనా వాటిని మసిచేయగలంత నిప్పువున్నచోట. దబ్బున తీసియ్యి.'

అమనుల్లా ఏమిచేస్తాడు? ఉత్తరాలుఇచ్చేయాలా? లేక పిస్తోలుబారుకు గురికావాలా? ఈవిధమైన పరిస్థితి ఎదుర్కోవలసి యుంటుందేమోనని ముందే ఆలోచించుకోక పోతినని తన్ను తాను నిందించుకున్నాడు. ఎల్లాగైనా వీలైనంతవరకు కాలయాపన చెయ్యాలనుకున్నాడు.

కాని మధు పిస్తోలు నొక్కబోయినప్పుడు అతడు లేవక తప్పిందికాదు. లేచి గోడవద్ద పెట్టెతెరచి అందులోని వుత్తరాలు—ఒక ఎర్ర సిల్కుదారముతో కట్టబడియున్నవి తీసి దూరాన్నుంచే ఆమెముందుకు విసరేడు. పిస్తోలు గురి భంగముకాకుండా అతనికేసి చూస్తూ వంగి ఆ ఉత్తరాల కట్ట అందుకున్నది మధు.

'అమన్, నీవు కేవలము జంతువవు. నీ దాసివలె చూచావు నన్ను. అదంతా సహించాను నా అవజ్ఞతను నిందించుకుంటూ. కాని ఇప్పుడు సంగతులు మారిపోయినవి. ప్రేమరుచి తెలిసినస్త్రీల సాహసము నీవూహకందనిది. ప్రకాశంయొక్క పవిత్రత నాహృదయంలో ప్రేమజ్యోతిని వెలిగించింది. అతని సౌఖ్యంకోసం నాజీవితం బలియీయవలసివస్తే వెనుకాడను. అతనివద్దకే వెళ్తున్నా నిప్పుడు. వెళ్ళబోయేముందు నీవల్ల ఇంకోపని కావ

లసివున్నది. మరేమీలేదు; కాగితమూ, కలమూ తీసికొని నేనుచెప్పినట్లు వ్రాయి.'

సన్ననికంఠంతో ఈవిధంగా చెప్పింది మధు.

'అమనుల్లానైన నేను మధుపై కొన్ని నింద లారోపింప దలచాను చెడుతలపులు కలిగి. కాని ఆమె ఎప్పుడూ నాప్రేయసికాదు. ఆమె చరిత్రలో కళంకము లనదగిన వేవీ నాకు తెలియవు.'

వ్రాసి సంతకంచేసి లేచి నిల్చున్నాడు అమనుల్లా. 'ఇదంతా వట్టి అబద్ధాల కుప్పగదా మధూ!' అన్నాడు నవ్వుతూ—

'ఔను. అబద్ధాలే'అన్నది ఆమె— 'కాని అవే నన్ను నీబారినుండి రక్షిస్తవి భవిష్యత్తులో— అవే నాకు ప్రకాశంతో సౌఖ్యజీవనము గడపే అవకాశమిస్తవి— ఇకముందు నేనొక నిండారు ప్రేమజీవితం గడుపదలచాను— దానికి భంగముకలుగకుండేటందుకు నేను చెప్పని అబద్ధమూ, చేయని సాహసమూ ఉండదనుకో—'

వికటంగా నవ్వు సాగించాడు అమనుల్లా— అతని ముఖంలో మార్పు కనుపిస్తున్నది— ఏదో పొరపాటు జరిగిందనుకున్నది మధు— వ్రాసిన కాగితాన్ని ముక్కలు ముక్కలుగా చింపేశాడతడు—

మధుముఖంలో నెత్తురుచుక్క లేకుండా పోయింది. పిస్తోలు కేసిచూచి ఏమిజరిగిందో తెలుసుకున్నది. తనఉద్రేకంలో పిస్తోలు నొక్కేసింది ఎప్పుడో, కాని అది పేలలేదు, అందులో తోటాలులే వసలు.

భయముతో వెనుకడుగులు వేస్తున్నది మధు. అమనుల్లా తరుముకొస్తున్నాడామెను.

'వెనక్కుపో!' అంటూ మళ్ళీమళ్ళి పిస్తోలు నొక్కింది మధు. కాని అది నిరపాయకరమైన 'క్లిక్, క్లిక్' అనే శబ్దంచేసింది.

'మధూ! లాభంలేదు. ఆయాసపడకు— తప్పించుకునిపోయేదారి లేదు. నీకు— విధికూడా నిన్ను నాకే వప్పజెప్పింది.' అమనుల్లా అన్నాడు—

అతని చేతు లామె నడుముచుట్టూతిరిగెను— అతని పెదవు లామె నోటిదగ్గరకు వచ్చినవి— మూర్ఛలో మునిగినట్లైంది మధుకు.

కాని తక్షణమే అతడామెను వదలేసి వెనక్కుపోయాడు.

మరునిముషమందు మధు ఆశ్చర్యముతో తన పాదములవద్ద అచేతనుడై వున్న అమనుల్లాను చూచింది—

వెంటనే ప్రక్కకుతిరిగింది— తలుపు దగ్గర పొగగ్రక్కుతూన్న రివాల్వరు చేతపట్టుకుని నిల్చున్నాడు గంగాధరనాయుడు— ఒక స్వప్నరంగమువలె వున్న దదంతా మధుకు.తన తండ్రేనా? అతని ముఖంలో పూర్వపు అసంతృప్తి అంతా ఏమైంది? ప్రశాంతంగా వున్నాడు— పుత్రికా వాత్సల్యముతో చూస్తున్నాడు తన్ను.

'మధూ! అంతావిన్నాను— భయపడకు— నాదగ్గరకు వచ్చి వట్టి అబద్ధాలాడటమే అమనుల్లాచేసిన గొప్పతప్పు— అతన్ని నేను అనుసరించే వున్నాను. ఎందుకంటే నీలో పరివర్తన చూడాలనే కాంక్ష నాకెక్కువగా వున్నది— మించిపోయింది లేదు. మధూ! రా. ఈరాత్రే నీ ప్రకాశందగ్గరకు పోదువుగాని—'

'నాన్నా!'—పిచ్చిగా చూచింది మధు ఆయనకేసి— వాత్సల్యము తొణుకాడే చిరునవ్వు ఆయన పెదవులమీద! తండ్రి కౌగిలిలో తన్నే విస్మరించింది మధు కొంతసేపటివరకూ— ఆ ప్రశాంతనిశీధము మధురముగ నిశ్శబ్దగీతికలు పాడింది.

# జలదరింపజేయు జవాబులు

రచయిత :

హాలుడు, బి. ఏ., బి. ఇడి.

### జనమంచి వెంకట్రామయ్య.

జనమంచి వెంకట్రామయ్యగారితో మాట్లాడుతూ ఆయనకు చరమదశలో వచ్చిన కష్టాలకు సానుభూతిపూర్వకమైన పలుకులు రానివ్వగా, 'ఇదంతా దేవుడు పరిశోధనచేయడమండీ' అని జవాబిచ్చారు. నే నేదో సంభాషణ సాగనిద్దామనుకుంటే యిది దానినంతటితో త్రుంచివేసింది. ఈజవాబు త్వరితగతిగలది, అనుకోననిది, చురకత్తివలె యెదుటివారిని దూసికొనిపోగలది. అట్టిదానికి ప్రత్యుత్తరముండదు. అది వక్తయొక్క గుణాన్ని కూడా విశదంచేస్తుంది. ఇందలితెలివి మూలమూలలకు చొరబారి విషయగ్రహణం చేయగలదు, సత్యగర్భాన్ని నిశ్చయముగా చొరగలది.

గొప్పజవాబులన్నింటికి యిట్టి సమాప్తి వుంటుంది. అవి హేతువాదపూరితాలుగావు. ఏకాగ్రచిత్తానికి గోచరించిన సత్యమువంటివి. ఇట్టిజవాబులివ్వడానికి వారికి యోచనగాని, పూర్వవిషయస్మృతిగాని అనవసరము. వారిదృష్టి యెప్పుడూ సత్యముపై లక్షితమైవుంటుంది. ఆభావము వారిజీవితమునందలి వివిధవిషయాల్లోను అనుభూతికి రావడంవల్ల శ్వాసించడమెంత సహజమో ఆభావానుభవము కూడా వారి కంతసహజము; అప్రయత్నపూర్వకము అవుతుంది.

### కర్ణుడు.

శ్రీకృష్ణుడు భారతంలో రాయబారం నడిపిన అనంతరం కర్ణునిపిలచి రహస్యంగా అతనిజననవృత్తాంతాన్నెరిగించి రణమున పాండవవిజయము కౌరవవినాశము నిశ్చయించి చెప్పాడు. మరిన్ని అతను పాండవులతో కలసివస్తే సమస్తమహీమండల రాజ్యాధిపత్యమూవహిస్తూ జగదేకవీరులైన పంచపాండవులు కొలుస్తూండగా అతిలోకసుందరి అయిన ద్రౌపదిని భార్యగాగ్రహించి భూలోకస్వర్గమనుభవింప వచ్చునని ఆశ పెట్టాడు. కాని మహానుభావుడైన కర్ణుడు ఇంచుకంతా వికారముపొందలేదు; యోచించటానికి కాలముకూడా తీసికోలేదు. అతడిచ్చినజవాబిది :

శా॥ సౌహార్దంబునజేసి చెప్పితివి
నాశ్రేయసంబెంచి, సం
దేహంబిసుమంత లేదయిన
నోదేవా వచింతున్ వినం
గా, హర్షింపుము; నీవుచెప్పినది
నిక్కంబంచు నూహించితిన్;
మోహింపంజుమి పాండుపుత్రుడను
నేనుం ధర్మమార్గంబునన్.

(శ్రీకృష్ణభారతము.)

### లూధరు.

లూధరిచ్చిన జవాబుకూడా యిట్టిదే. లూధర్ని తనకనుకూలునిగా త్రిప్పాలని పోప్

తనశిష్యుణ్ణి పంపాడు. సామదానములను విరివిగా వుపయోగించాడు గాని లాభించలేదు. లూధరు తనవాదాన్ని మానడమునకు ఇచ్చగింపలేదు. లూధరు పేదవాడు. సామాన్య కృషీవలుడికుమారుడు. పోపు అన్ననో ధనికుడు, సమస్తక్రైస్తవ ప్రపంచమునకు నేత; ఐరోపీయసామ్రాట్టులనందరను గజగజలాడింపగలసమర్థుడు. అట్టిపోపుమాటను లూధరు నిరాకరించడము కార్డినలుకు ఆశ్చర్యం కలిగించింది. అపుడుకార్డినలు ఇల్లాఅన్నాడు, 'ఏమి! ఒకజర్మను పల్లెటూరిబచ్చామాటలను పోపు లక్ష్యంచేస్తాడా? అతడు తనచూపుడు వ్రేలితో జర్మనీనంతను అణచిపెట్టగలడు. నీవంటి నికృష్టకీటకము కొఱకు మీరాజు పోపుతో కలహిస్తాడనా నీయోచన? అల్లైన్నటికి కాగా అపుడు నీవెక్కడనిలుస్తావు?' 'ఇప్పటివలెనే అప్పుడునూ సర్వశక్తిమంతుడైన భగవంతుని కరకమలములలోనే నిలుస్తాను' అని లూధరు జవాబిచ్చాడు.

### సర్ థామస్ మూర్.

సర్ థామసుమూర్ న్యాయాధిపతిగా వుండగా ఇంగ్లాండు రాజైన ఎనిమిదవ హెన్రీ శాస్త్రవిరుద్ధంగా రెండవభార్యను స్వీకరించాడు. రాజుకిభయపడి అందరు అదిశాస్త్రసమ్మతమేనన్నారు- కాని మూర్ అందుకువొప్పుకోలేదు- రాజు అతనికి అనేకవిధములైన ఆశలు ఎరపెట్టాడు కాని అతనులొంగలేదు- చివరకు రాజు ఆతన్ని చెరలోపెట్టాడు- అపుడతని భార్యవచ్చి, 'ఇందరు వొప్పుకోగా నీవేల వొప్పుకోరాదు? నీరమ్యహర్మ్యమేడ తేమతో చితచితలాడు ఈచీకటికొట్టేడ?' అని విలపించింది- కాని ఆధీరుడు చలింపక ఇట్లు పలికాడు: 'స్వర్గము నీయింటికెంతసమీపమో యీచీకటికొట్టునకుకూడా అంతేసమీపము.'

### రామస్వామి.

మాఘ్రాళ్ళో రామస్వామిగారనేవారుండేవారు. అదియిప్పటికి నాలుగైదుతరాలక్రిందటిమాట. ఆయన వేదాధ్యయనంచేస్తే ఆదిశేషుని తలపించెడివాడట. అతని శిష్టాచార సంపత్తిని, వేదాధ్యయనమునూ మెచ్చుకొని ప్రభువు అగ్రహారమిస్తాను రమ్మని కబురంపాడు. వేళాకోళమాడిందని భార్యాపరిత్యాగంచేశాడ ప్రభువు. శాస్త్రి అవడానికి నిరుపేదే; కాని దృష్టియెప్పుడూ ఆముష్మికంమీదే. ఆకబురువిని, 'ధర్మపత్నీసహితుడయి చేస్తేనే మీప్రభుహస్తదత్తమైన దానముపరిగ్రహణముచేయుడమని మీప్రభువుకు చెప్పండి' అన్నాడు. ప్రభువు అహంభావాన్ని త్యజించి భార్యనుతేలేదు; శాస్త్రి ఆదానము గ్రహించలేదు.

### గోపన్న.

తానీషా గోపన్నురప్పించి 'నాడబ్బెవరు తెచ్చియిస్తా' రని అడిగితే అచంచలభక్తిభావబంధురుడైన అతడు 'భద్రాచలరాముడే తెస్తా' డన్నాడు.

### పోతరాజు.

పోతరాజు ఐహికవిషయాలను కాంక్షించినవాడుకాడు. కాయకష్టానికి కవితాజీవితానికి సంబంధంలేదని ప్రజలు తలచిన వెట్టిరోజుల్లో ఇతడు హాలికజీవితాన్ని గడపినధన్యుడు. ఈవిషయాన్ని గూర్చి అతనిని హేళనపూర్వకంగా 'మీరు హాళికులా!' అని అన్నంతనే అతనిచ్చినజవాబు ప్రసిద్ధం.

ఉ॥ బాలరసాలసాలనవపల్లవ
కోమలకావ్యకన్యకన్

గూళలకిచ్చి యప్పుడుపుగూడు
　　భుజించుటకంటె సత్కవుల్
హాలికులైననేమి గహనాంతర
　　సీమల గందమూలగౌ
ద్దాలికులైననేమి నిజదారసు
　　తోదర పోషణార్థమై.

ఇట్టిజవాబులు ఆత్మానుభూతికలవారికి గాని యితరులకు రావు.

ఆబ్రహాము లింకను.

ఇట్టి జవాబుల్లో హాస్యము నర్మముగూడా మిళితమవడము అసాధారణము. అమెరికా దేశానికి అధ్యక్షతవహించి కీర్తికాముడైన ఆబ్రహాములింకను ఒకరోజున తనకాలిజోళ్ళకు రంగువేసికొంటూండగా లయన్సుఅను ఆంగ్ల ప్రభువుచూచి ఆశ్చర్యంపొంది, 'మా దేశంలో ఎవరున్నా తమజోళ్ళకు తామే రంగువేయరు.' అన్నాడు. అదివిని, 'మరివాళ్ళెవరిజోళ్ళకురంగువేస్తారు?' అని ప్రెసిడెంటు లింకను పలికాడు

పురాణంపండ మల్లయ్యశాస్త్రి.

ఈమధ్య వారిలో నర్మవాక్యపారీణతగాంచింది పురాణంపండ మల్లయ్యశాస్త్రిగారు. వీరినొకరొకనాడు, 'శాస్త్రిగారు! మీరు అన్నవరం సత్యనారాయణ స్వామిని చూచారా?' అని అడిగారు. 'లేదండి. ఆచిరంజీవికి నేనువెళ్ళి మ్రొక్కితే ఆ యుక్షీణమవుతుందని మానేశాను' అనిజవాబిచ్చారు. శాస్త్రిగారి వయస్సప్పటికి ఏబది దాటివుంటవి, సత్యనారాయణస్వామి వెలసి పాతికసంవత్సరాలయివుంటుంది.

పిండిప్రోలు లక్ష్మణకవి.

ఇట్టి నర్మగర్భితమైన ప్రశ్నోత్తరాలు మన తెనుగుభాషలో మెండుగావున్నాయి. రావు నీలాద్రిరాయణింగారున్నూ, పిండిప్రోలు లక్ష్మణకవిగారున్నూకలసి మాట్లాడుతూండగా కవిగారి రుమాలు క్రిందపడ్డదట. అది ప్రభువు చూచి, 'రావగారు! మీరు మాలా?' అన్నారట. వెంటనే కవి 'అవును మాదిగా' అన్నాడట.

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి.

రాజమండ్రి కళాశాలలో సభజరిగింది. దానికి బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు సభాధిపతులు. ఎవరోసంభాషణాక్రమంలో, 'శాస్త్రిగారు! మీరిప్పుడేమైనా వ్రాస్తున్నారా?' అన్నారు. 'ఇంకావ్రాయాలా నండి! నీరసంతప్ప మరేరసంలేదు' అన్నారు. హాస్యరసభరితాలగు యిట్టిజవాబు లివ్వడము లో శాస్త్రిగారు అందెవేసినచేయి.

కాని వీనిలో పోతరాజు, కర్ణుడు, బాంధరు, వెంకట్రామయ్య మొదలగువారిచ్చిన జవాబులలోవున్న అనుభూతిలేదు. వారి జవాబులతో సంభాషణక్రమమున్నూ, వక్తలభావవీథిన్నీ పూర్తిగామారుస్తుంటవి. ఆజవాబులవల్ల అశాశ్వతాలు శాశ్వతములవుతాయి, ఐహికములు ఆముష్మికములవుతాయి. దయాసత్యశౌచములను మీరక పరహితంకరకార్యపరత్వముగల జీవన్ముక్తులుమాత్రమే అట్టి మహత్తరములైన ఉత్తరము లివ్వగలరు. మనలో త్యాగమూర్తులు, జ్ఞానధనులు, దానకర్ణులు ఎందరోవున్నారు. ఆంధ్రులు వీరపూజాధురంధరులుకూడా. కనుక ఇట్టి ఉత్తమ ప్రత్యుత్తరాలను సేకరించి మన నిత్యజీవితాన్ని, వాఙ్మయాన్ని ఫలవంతంచేసికోవాలి.

# తెలుగులో కథలు వ్రాసేవారు

రచయిత:

కృత్తివాసతీర్థులు

మన తెలుగుతల్లి నేటికి కథలువ్రాయడం కూడా ఒకకళఅని తెలుసుకొన్నది. కథ సారస్వతంలో ఒకశాఖక్రింద పరిణమించినది. కథవ్రాయడమే కాకుండా చెప్పడంకూడా కళే. అసలు కథఅంటే కథ్ = చెప్పు (వ్యక్తాయాం, వాచి) అనేదానిమీదనుంచి వచ్చింది. కథలు వ్రాసేవారు తెనుగులో లెక్కకు మిక్కుటంగావున్నారు. వారిలో చక్కగా వ్రాసేవారిసంఖ్య అల్పము. ఈకథల్లో జాతి జీవనము, సంఘజీవనము, ప్రేమ, మానవహృదయము, దేశభక్తి మొదలైన విషయాలు ఉంటున్నవి. చక్కగావ్రాసేవారి రచనలలో పరువమూ మెత్తదనమూ వున్నవి. ముఖ్యంగా కథల్లో అమృతమువంటి సజీవమైన వ్యావహారికాంధ్రము ఉపయోగింపబడుతూనేవుంది.

ఇక రెండో విషయం. అనుకరణాలు, అనువాదాలు, ఛాయలబాపతు. ఒకమంచికథ ఎవరైనా వ్రాసివుంటే ఆకథనే వస్తువుగా గ్రహించి, కించిత్తు మార్పులతోనో లేకపోతే ఆవిషయాన్నే తీసుకుని ఫొటోలు తీసినట్టు కథలు వ్రాస్తారు కొందరు. అలాగ కొన్నివందలూ వేలూ వున్నాయి కథలసరకు. అంతా చెత్త. భాషకుగాని భావోన్నతికిగాని రవ్వంతకూడా తోడ్పడకుండా వుంటున్నాయి. ఆచెత్తకథల్లో విషయం ఉదాత్తంకాదు, వ్యక్తీకరణాలోకుంటూ, ట్రీట్మెంటులో చేతకానితనం వుంటున్నాయి. కొన్ని కథల్లో అసందర్భంగా అర్థయుక్తముకాని మోటుహాస్యం ఉపయోగింపబడుతూవున్నది. హాస్యం నర్మగర్భంగా పెద్దమనిషితరహాగా ఉండాలి. ఇప్పుడు ప్రతివారికీ బూతులో హాస్యం కనిపించింది. ఆశ్చర్యం! హాస్యరసప్రధానాలైన కథల్లో మోటుహాస్యం కనపడుతూవుంది. అటువంటి రచన సంఘజీవనానికి సంఘాభ్యుదయానికీ ఏమీ తోడ్పడదు. కథల్లో వెర్రిగా ప్రబంధాలును మించిపోయిన పచ్చి శృంగారం అసభ్యతతో, అనౌచిత్యంతో ఉంటూవున్నది. ఇలాంటి తుక్కుకథలు హాస్యపు పత్రికలనే పేరుతో ప్రకటింపబడే వాటిల్లో దిగుమతి అవుతాయి. స్వారస్య నిర్ణాయకులు ఎవ్వరూ వీటిని అభిమానించరు, ఆదరించరు. పాఠకులు కథలమాట అలావుంచి మంచివాని విషయం జాగ్రత్తగా విమర్శనాదృష్టితో పరిశీలనచేదాం.

చింతా దీక్షితులు.

నేటి కథకులలో శ్రీచింతా దీక్షితులుగారు ఉత్తమశ్రేణికి చెందినవారు. వీరికథలు సాహితీపత్రికాముఖంగా ఆంధ్రలోకానికి అందచేశారు. కథలలో మార్దవం సహజత్వం కనిపిస్తుంది. బాలుర మానసికప్రవృత్తులు ఎంతో రమ్యంగా చిత్రించగల ఎమరుపెరిగిన అనుభవంగలచెయ్యి. ఎక్స్ప్రెషన్ చాలాక్లు

స్తంగా చక్కగా అర్థవంతంగా నాజూకుగా వుంటుంది సహృదయులహృదయాలను వీరికథలుచూరగొంటాయి. 'ఏకాదశి' అనే పదకొండుకథలు పుస్తకరూపంలో వేశారు. ప్రతి కథాకూడా వకకళాఖండ మన్నమాట. శివశంకరశాస్త్రిగారు అన్నట్లు వీరు నిజంగా 'కథక చక్రవర్తు'లు. ప్రతికథకూడా ఒక ప్రత్యేక సాధనవంటిది. దీక్షితులుగారు వ్యుత్పన్నుడు. ఆంధ్రవాఙ్మయంలో వీరికి మంచి స్థానం వున్నది. 'తాట్రివనంలో' 'చెంచుదంపతులు' అనే రెండు అద్భుతమైనరచనలు అద్భుతమైన వారికృషి. 'సఖి' ఆపంట నోచుకొన్నది. ఆంధ్రపఠితలు చాలామంది ఆనందించారు. వీరు చాలాకథలు వ్రాశారు. అముద్రితాలు చాలా వున్నాయి.

## మొక్కపాటి నరసింహశాస్త్రి.

ఉత్తమశ్రేణికి చెందినవారు, ఆంధ్రులకు హాస్యరసభరితమైన నవలను, కథలనూ వ్రాయడంవల్ల చిరపరిచితులైనారు శ్రీ మొక్కపాటి నరసింహశాస్త్రిగారు. వీరి 'బారిష్టరు పార్వతీశం' ఒక ప్రత్యేకవ్యక్తి ఆంధ్రులలో. అందరికీ నవ్వుపుట్టిస్తూ వుంటాడు. వీరు కథలు అసంఖ్యాకములు వ్రాయకపోయినా వ్రాసినకొద్దీకూడా చాలా విలువైనవి. కథలు వ్రాయడంలో దక్షత గోచరిస్తుంది. మానసికప్రవృత్తిని చక్కని తూలికతో కథలలో చిత్రిస్తారు. అయితే అక్కడక్కడ వర్ణనలు సందర్భశుద్ధితోవున్నా, కొంత ప్రాచీనంగా కనబడతాయి. సఖిపత్రికా ముఖంగా 'చిత్తరువు' 'శిల్పిద్వయం' ఆంధ్రులకు అందినవి. కథానకములను ప్రతిబింబములనే పేరుతో ముద్రించారు. అన్నికథలూ ఒకసారి చదివిన తరువాత మళ్ళీ చదువవలెనని అనిపిస్తుంది. శైలి మనోహరంగావుంటుంది. చిన్న పిల్లలు చదువుతున్నా అర్థమయ్యే తేటతెలుగులో వుంటుంది రచన. వారినవలలు రెండూ ఇందుకు ఉదాహరణ. (పార్వతీశం, ఏకోదరులు) రసవ్యక్తీకరణ బాగాచేయగలరు. ఏకోదరులు అనే పెద్దకథలో (నవల అనినేను అనను దాన్ని) కరుణరసము చక్కగా వ్యక్తీకరించి పోషించారు. పాత్రపోషణ బాగావుంది. వీరి రచనలవల్ల కొంత నవీన ప్రాచీన సంప్రదాయాలను అనుసరిస్తారని తోస్తుంది. హిందూ మతంమీద విశ్వాసం దృఢంగా కనపడుతుంది. సంఘసంస్కారమంటే కొంచెంవప్పుకోనట్టు కనపడుతుంది. భారతిలో ముద్రితమైన 'న్యాయం' -'రంగగ్రామసింహరత్తయ్య' అనే కథలు వీరి అద్భుతఉపజ్ఞకు ఫలితాలు. 'న్యాయం' అనేకథవల్ల సామాన్య దరిద్రుణ్ణి ధనవంతుడు ఎలానీచంగా చూస్తాడో, ధనవంతుడిమాటనే లోకం విశ్వసిస్తుంది కాని బీదవాడిమాట లెక్కచెయ్యదనీ, న్యాయం అనేపేరుతో జరిగేదంతా అన్యాయమనీ, జాతివివక్షత వుంటున్నదనీ మొదలైన విషయాలన్నీ ద్యోతకమవుతాయి. రచనలో వైవిధ్యం వుండి ఆనందంకల్గిసుంది మన హృదయాలకు.

## గుడిపాటి వెంకటచలము.

గుడిపాటి వెంకటాచలంగారు చాలా కథానకములు, నవలలు, నాటకములు వ్యాసములు సంఘమరమ్మతుకోసం వ్రాశారు. వీరి ఆశయాలు చాలా విపరీతంగా; మామూలుగావుండే జనులకు కొంచెం తీవ్రంగా, తుపాకీపాట్లాగ చురుకుగా వుంటాయి. ఈయన వకప్రత్యేకవ్యక్తి. అంతా హేతువాదం మీద వుంటుంది ఈయనరచన. అందులో వకీలుకావడంవల్ల మరీ ఎక్కువ ఈహేతువాదం. సెక్సుప్రోబ్లెం గూర్చి ప్రత్యేకంగా చ

డివి కొంత లోకానుభవంవల్ల, కొంతస్వానుభవంవల్ల ఈ చెప్పబోయే విషయాలను కథ రూపేణా వ్యక్తీకరిస్తారు. మన సంఘంలో స్త్రీలను ఎలా బానిసలువలె నీచంగా చూస్తారో, మనం అనుకొనే పతివ్రతలు పతివ్రతల్ కారని, ప్రాచీన సంప్రదాయాలు వినవద్దనీ, సంఘంలో వెర్రినమ్మకాలూ ఆచారాలూ చచ్చుమతం, పురుషుడికి **వ**కనీతీ స్త్రీకి వకనీతీ ఏర్పాటుచేసిన చచ్చు న్యాయ నమ్మసంఘం, వివాహంగూర్చిన అభిప్రాయం, స్త్రీస్వేచ్ఛ వివాహం జన్మాంతర సంబంధమూ, ఐహికాముష్మికాలకోసం ధర్మచరణకనీ పవిత్రమనీ అన్న అభిప్రాయంకాదని, మనం అనుకొనే నీతికి అసలు నీతికీ వ్యత్యాసం—ఈవిషయాలన్నీ వారు హేతువాద రీత్యా కథలలో వెలువరించారు. 'కన్నీటికాల్వ' 'దైవమిచ్చినభార్య' 'వ్యాకర్మంఇలా కాలింది' 'శశిరేఖ' మొదలైన వందమూ చూచేవుంటారు. కథలు చాలా సెన్సేషనల్గా వుంటాయి. బలహీనుడి హృదయాన్ని వెంటనే లొంగదీసుకొంటాయి. కథలలో కొంత వైపరీత్యము, అనౌచితి, అసందర్భము కూడా కనపడుతుంది. 'ఆడాళ్ళగుట్టు బయటపడవేసి' దాహంతీరకుండా ఆమూలాగ్రం ప్రబంధకారుడిలాగ వర్ణిస్తారు. ఆర్టు కన్సీల్సు ఇన్ ఆర్టు.కళ నగ్నరూపంగా వుంటేనే కళ అవుతుంది. అంతేకాని నగ్నత పోయాక జుగుప్స కలుగుతుంది. అయితే వర్ణనలన్నీ కళ్ళకు కట్టినట్లు వుంటాయి. కథనడపడంలో నేర్పువున్నది. భాష కొంచెం వక్రగతికి పోతూవుంటుంది. శైలి సరళం ధారాళంగా వుంటుంది.

## మునిమాణిక్యం నరసింహారావు.

మునిమాణిక్యం నరసింహారావుగారి పేరు అందరికీ తెలిసేవుంటుంది. సంసారికకథలను అద్భుతంగా వ్రాస్తారు. కథలలో నర్మహాస్యం వుంటూవుంటుంది. 'వినోదిని, సాహితి, సఖి' మొదలైన చాలా పత్రికలలో వీరి కథలను చూస్తూవుంటాము. ఒకరిలాగన్నారు:'మీకథలు నన్ను గార్హస్థ్యాభిముఖంచేస్తున్నాయి' అని. అంతేచాలు వీరినిగూర్చి చెప్పడానికి. 'కాంతంకథలు', 'నేనూ మా కాంతం' వీరి ఉపజ్ఞకు ఫలితాలు. 'కాంతం' సామాన్య ఆంధ్రుల ఇళ్ళలో వుంటూనేవుంటుంది. కాంతాన్ని చక్కగా పోషించారు మునిమాణిక్యంగారు. ఎలాగయితేనేం కాంతం కాటుక్కాయ కావ్యగోష్ఠిలోకి వచ్చింది.

## శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి.

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ప్రబుద్ధాంధ్రపత్రికా సంపాదకులు. రాష్ట్రభక్తి, జాత్యభిమానంకలవారు. భాషదాస్యానికి ఏమీ వప్పుకోని ప్రత్యేకవ్యక్తులు. గొప్ప కథకులు. వీరికథలు సంఘజీవనాన్ని ముఖ్యంగా ఆంధ్ర దేశీయుల ఆచారవ్యవహారాదులు చక్కగా చిత్రిస్తాయి. 'యావజ్జీవంహేష్యామి' 'కన్యాకాలేయత్నాద్వరితా' వీరి ప్రత్యేకకృషి. భాష కోనసీమ తెలుగు. కొంచెమెక్కువమాస కనపడుతుంది. గుణవిషయం అయ్యాక అవగుణాలుకూడా చూతాం. ఇప్పుడిప్పుడు వ్రాసేకథలు నిండా సంభాషణ. సంభాషణకు కొన్నిహద్దులు, అవసరాలూ వున్నాయి. అది వారు గమనించి సంభాషణ నడిపించాలి. అయితే సంభాషణ నడిపించడంలో వీరికి పెట్టినపేరు. రచనలో వైవిధ్యంలేదు. ఎంతసేపటికీ తెలుగుదేశపు వితంతువు—ఎవరో దానిమీద కన్నువేసిన పెద్దమనిషి—మధ్యపిట్టగోడ—ఇక కథనడుస్తుంది. ఫొటోగ్రాఫుల తీసినట్లు కొ

న్నిపుంజీలు కథలు వ్రాశారు, వెరైటీ లేకుం డా.'పూలదండ' మొదలైనవి చూడండి. వా సనచూడండి. వీరు నేరేషన్ కూడా ఉంచి వీలయినంతవరకు సంభాషణ తగ్గించి, ప్రొపో ర్షన్ ఆలోచించి చూచుకొని మరికథలు వ్రాయాలి. వెరైటీ ఉండితీరాలి. లేకపోతే అస్తమానం 'వితంతువు' కథావస్తువైతే తలనొప్పివేస్తుంది. అందువల్ల ఈవిషయాలు వారు గమనించి చక్కగా కథలు వ్రాస్తే నయం, అలా వ్రాయాలని మా అందరి కోరిక.

కవికొండల వెంకటరావు.

ఇక కవికొండలవారు 'ఉదయిని'లో వ్రా సిన కథ చక్కగావుంది. వీరు తమరచనలో మానవులనిరాడంబరజీవితము, కర్షకులు గ్రా మజీవనము చక్కగా చిత్రిస్తారు.

వేలూరి శివరామశాస్త్రి.

వేలూరి శివరామశాస్త్రిగారు వ్యుత్ప న్నులు, కథకులు, పండితులు. వీరి రచనలో వెరైటీ ఎక్కువగా కనిపిస్తుంది. వాడుకభా షకు దగ్గరగావున్న గ్రాంథికంలో వ్రాస్తారు. కథలు బాగావ్రాస్తారు. 'ఓబయ్య' 'పిత్తల్ కాదర్బాజా' మొదలైనవి అంతా చదివే వుంటారు.

తాతకృష్ణమూర్తి.

తాత కృష్ణమూర్తిగారు సంసారికకథలు వ్రాస్తారు. ముద్దుమాటలుకడుతూ వుంటా యి.'రామప్రియ' అనే పుస్తకం రచించారు.

ఇంకా కొంతమంది.

వెంపటి నాగభూషణంగారు, మల్లాది రా మకృష్ణశాస్త్రిగారుకూడా ఒకమాదిరి మంచి కథలు వ్రాస్తారు.

స్త్రీలలో వ్రాసేవారు ఎక్కువమందిలేరు. కనుపర్తి వరలక్ష్మమ్మగారు నానావిషయాల మీద మెళుకువతో బుద్ధికుశలతతో సంఘా నికి పనికివచ్చేకథలు వ్రాశారు. గుమ్మిడిదల దుర్గాబాయిగారు కథలు వ్రాస్తారుకాని అం తా హిందీనుంచిరవాణా.

ఇంకా కొంతమంది ఒకమాదిరి కథలు వ్రాస్తారు. వారిలో పూడిపెద్ది వెంకటరమ ణయ్య, చిరుమామిళ్ళ శివరామకృష్ణప్రసా ద్, కొడవటిగంటి కుటుంబరావు, బొడ్డు బా పిరాజు, 'గిరి', కృత్తివాస తీర్థులు, వఝ్ఝల కా ళిదాసు, గుడూరి చలం, మల్లాది వెంకటకృ ష్ణశర్మ, మల్లాది అవధాని, ఏటుకూరి కామే శ్వరరావు, జనమంచి కామేశ్వరరావు, ముద్దా విశ్వనాథం, కలగ సత్యనారాయణ, పురాణం కుమారరాఘవశాస్త్రి, కాళూరి రామారా వు, క. గోపాలరావు, కపిల కాశీపతి, మొదలి సుబ్రహ్మణ్యశర్మ, మొదలి సీతారామస్వామి, రఘుపతిరావు, ఆచంట సూర్యనారాయణ మూర్తి, సాంబమూర్తి, పమ్మి రామశా స్త్రి, ఇంద్రగంటివారు, కాంచనపల్లి రంగ రావు, జానకిరామచౌదరి గార్లుకలరు.

మరొకవిషయం. నీతిబాహ్యమై సంఘగౌ ర్బల్యమునకు తోడ్పడే అసభ్యతతోకూడిన కథలు వ్రాయకూడదు. ఉన్నతభావములతో లక్ష్యశుద్ధితో చమత్కృతితో కథలు వ్రాస్తే సారస్వతములో స్థిరంగావుంటాయి. ప్రయో జనములేని కథలు వ్రాసి నిష్ప్రయోజనం. సారస్వతసేవ చేయ్యడానికి గద్యపద్యాదుల తోపాటు కథలుకూడా చక్కగా రాయాలని రచయితలను కోరుతాం.

# 'గౌరీకల్యాణము' పాడిన గౌరి

రచయిత:

కాళూరి వెంకటరామారావు

౧

అసలు పెళ్ళికాకముందే తనకి మేనమామకూతురు 'రామి' అక్కరలేదని మారిగాడు భీష్మించుకు కూచున్నాడు. అయినా కావలసిన సంబంధం వదులుకోలేక వాడి తల్లిదండ్రులు పట్టుపట్టి దాన్ని బలవంతంగా కట్టిపెట్టారు వాడికి.

'రామి' ఏమంత అందమైందికాదు. బొత్తిగా చిన్నపిల్ల. యౌవనవంతుడైన మారిగాడికి లేతపాప రామి ఆనందం కలిగించలేదు. భర్తవచ్చాడన్న సంతోషము ఏమాత్రమూ అనుభవించలేని వయస్సులో ఉన్న రామిని చూసి వాడు విచారమే పొందాడు. భార్య తలపులోకి వచ్చినపుడల్లా మారిగాడిముఖంలో దైన్యం గోచరించేది.

పెళ్ళిఅయిన దగ్గరనించీ వాడు తరుచు ఏవో ఆలోచనలలో మునిగిపోతూఉండేవాడు. వాడిస్థితిచూసి తల్లి విచారించేది. అలాంటప్పుడు వాడితండ్రి 'ఏటో! ఆడికంటే వెర్రిదానివైపోతున్నావునువ్వు. రెండేళ్లు కళ్లు మూసుకుంటే అదే పెద్దదైపోతుంది. అప్పుడాడే బాగుంటాడే, వెర్రిదానా!' అని భార్యని మందలించేవాడు.

మామగారు స్వయంగావచ్చి పిల్చినప్పటికీ ఏపండుగులకీ మారిగాడు అత్తవారింటికి వెళ్ళలేదు. తండ్రి ఎంతచెప్పినా వాడు వినిపించుకోలేదు.

ఇలాగ్గా సంవత్సరం గడిచిపోయింది. ఇప్పుడు మారిగాడి మరదలికి పెళ్ళి. ఆపెళ్ళికి రావాలని వాడి మామ చాలాపట్టుపట్టాడు. 'మీఅత్త రమ్మంటూందోయ్' అని కూడా చెప్పాడు. తీరుబాటులేదనీ, వరికోతలు రద్దీగా ఉన్నాయనీ, పెద్దకాపు కోపపడతాడనీ మారిగాడు వంకలు పెట్టాడు.

తండ్రికూడా చాలాదూరం చెప్పాడు. మాలపల్లిలో వాడిస్నేహితులచేత చెప్పించాడు. లాభంలేకపోవడం చూసి వాడితండ్రి యీ సంగతంతా పెద్దకాపుతో చెప్పేశాడు. పెద్దకాపు వీరాస్వామి మునకాలు కర్ర చంకకింద పెట్టుకుని, లావుపాటి పొగచుట్టతో అడ్డుపొగ వేస్తూ 'అత్తోరింటికెళ్ళరా' అని సహజమైన బొంగురుగొంతుకతో మారిగాణ్ణి కూకలేశాడు.

వీరాస్వామి ఆరడుగుల పొడుగుమనిషి. స్థూలకాయుడు. భార్యతోకూడా కాశీయాత్ర చేసుకుని వచ్చాడు. విశాలమైన నల్లని నుదుటిమీదా, బాగా ముందుకి వేలాడుతూఉన్న కడుపుమీదా దిద్దిననామాలు స్పష్టంగా దూ

రానికికూడా కనిపిస్తూ ఉంటాయి. పెద్దకాపు గూడెంగ్రామానికి ధనవంతుడూ, తగుమనిషీని. ఆఊళ్లో అతనిమాట సుగ్రీవాజ్ఞ.

పెద్దకాపుమాట కెదురుచెప్పడానికి మారిగాడికి ధైర్యంచాలదు. అందుచేత తప్పనిసరిగా ఈసారి వాడికి అత్తవారింటికి వెళ్ళవలసివచ్చింది.

మర్నాడు తల్లిదండ్రులతోకూడా మారిగాడు అత్తవారిఊరైన 'వావిలవలస' వెళ్లాడు. పెద్దకాపు కొడుకిచ్చిన కంటెమెడ చొక్కా తొడుక్కున్నాడు. వేలంలో కొనుక్కున్న మెర్రసిల్కు ఖండువా మెడలో ముడివేసుకున్నాడు. నూనెరాసి గిరజాలు నున్నగా దువ్వుకున్నాడు. సీమవెండిగొలుసున తగిలించిన అయిదారు తాళాలు ముణుకులవరకూ వేలాడుతున్నాయి. కిర్రుచెప్పులు విరామం లేకుండా ధ్వనిచేస్తున్నాయి. ఆనాడు మారిగాడివేషం కొత్తగానూ, అందంగానూ ఉంది.

వాణ్ణి అత్తగారు చాలా ఆనందంతో చూసింది. ఎంతో గౌరవంచేసింది. పెళ్ళికి వచ్చిన చుట్టాలందరికీ మారిగాణ్ణి చూపించింది.

రామి బాగా ముస్తాబయి చురుగ్గా తిరుగుతూంది. ఎర్రపువ్వుల పరికిణీ కట్టుకుంది. జాకెట్టుమాత్రం లేదు. మెడకింద గంధంరాసుకుంది. రెండుతమలపాకులు సంపాదించి కవిరతో కలిపి తాంబూలంవేసుకుని మాటిమాటికీ నాలుకరంగుచూసుకుంటూంది. చెల్లెలిపెళ్ళిలో అడావిడిఅంతా దానిదే.

మొదట మారిగాడిముందు ఏ అనుమానమూ లేకుండా రామి ఆడుకుంటూఉంది. ఇంతలో దాని పినతల్లివచ్చి 'రామీ! మొగుడిపక్కలో ఆడుతున్నావేంటే?' అని నవ్వింది. ఆమాటలు రామి వినిపించుకోకుండా ఆడుతూనే ఉంది. కాని వెనకనించి తల్లివచ్చి దాన్ని పక్కకి తీసుకుపోయింది. అది మొదలు రామి భర్తకనబడినపుడల్లా తుర్రున పారిపోయేది.

వీధిలో ఆడుతూఉండే బాలికలని చూస్తే దారిపోయే వయోధికునకెల్లాంటి భావాలు కలుగుతాయో రామిని చూసినప్పుడు మారిగాడి కంతకంటే ఎక్కువభావాలు కలగలేదు. మొగుణ్ణిచూసినప్పుడు తప్పించుకు తిరగాలని తల్లి యెందుకు చెప్పిందో రామి యెరగనే యెరగదు.

ప్రేమవృష్టి నాసించిన మారిగాడి హృదయం మరింత తపించిపోయి బీటలువారి పోయింది. రామిని చూడగానే వాడిమనసు నిరాశాంధకారంలో చిక్కిపోయేది. యౌవనవతీస్నేహలాలసములగు వాడి భావపల్లవాలు కాంతిహీనములై తలలు వాల్చేశాయి. మనోహరమైన మకరందరసంకోసం పోయే తుమ్మెదకి నిండావిడవని మొగ్గ దొరికితే యేలాగుంటుంది?

## ౨

మారిగాడి మామగారు రంగంవ్యాపారం చేసి గడించిన ధనవంతుడు. భాగ్యవంతుడికి చుట్టాలకేమిలోటు? బంధువులంతా పెళ్ళికి వచ్చేశారు.

లింగాలవలసనుండి బళ్లతో సామాను పట్టించుకుని కుటుంబసహితంగా వాడితమ్ముడు అన్నగారికి సహాయంచేసేటందుకు పెళ్ళి రెండురోజులుండనగానే వచ్చి పడ్డాడు. మారి

గాకూ తలిదండ్రులతో రెండురోజులు ముందు గానే వచ్చాడు. పేరుమట్టుకే మారిగాడి మామగారిదిగాని పెళ్ళిపెత్తనమంతా వాడి పినమామగారిదే.

ఇంక వివాహం రెండురోజులుమాత్రం ఉంది. పందిళ్లూ, పాకలూ పెళ్ళిపనులన్నీ చురుగ్గా జరుగుతున్నాయి.

సాయంకాలం ఆరుగంటలయింది. దివాణం కోనేటిలో పశ్చిమభానుబింబము బంగారపు స్తంభములాగు పొడుగునా నిలబడిఉంది. ఇంటికిపోతూ ఒక్క చేపపిల్లని మెగ రేసుకు పోడానికి రెండు గుడ్డికొంగలు నీటిఒడ్డున జపం లో మునిగిఉన్నాయి. నీటి అంచున నడుస్తూ ఉన్న బురదపాము రాకని కనిపెట్టి కప్ప పిల్లలు చెరువులోకి దుముకుతున్నాయి. అయి దారుగురు బ్రాహ్మణులు 'బాపన రేవు'లో నిలబడి సంధ్యావందనంచేస్తున్నారు. దివాణం దేవాలయంలో జేగంట మోగుతూంది.

మారిగాడు ఒక్కడూ కోనేటి ఉత్తరపు గట్టుమీద ఒక బండరాయిమీద కూచు న్నాడు.

మాలపల్లిలోని స్త్రీలు గుంపులు గుంపు లుగా చెరువులో నీరుముంచుకోడానికి వస్తు న్నారు. మాలపల్లిలోని యిళ్ళలోజరిగే గొ డవలన్నీ వాళ్ళ సంభాషణలలో దొర్లిపోతు న్నాయి. నీటిఒడ్డుకి పోగానే బిందెలుతోమే వాళ్లు కొందరూ, బట్ట లుతికేవాళ్లు కొందరూ, కబుర్లు చెప్పేవాళ్లు కొందరూ. కష్టజీవితము వల్ల గట్టిదేరి, ఆరోగ్యవంతములై, పూర్ణ వికాసాన్ని పొందిన వారి శరీరాలు నేత్రా నందకరంగా ఉన్నాయి ఆసాయంకాలపు నీ రెండలో.

అప్రయత్నంగా మారిగాడి చూపులు ఆ స్త్రీసమూహంలో ఉన్న ఒక యువతిమీదికి పోయాయి. చెరువులోకిదిగేటప్పుడే మారి గాడిదృష్టిని ఆపిల్ల ఆకర్షించింది.

పద్దెనిమిదేళ్లు దాటీదాటని యౌవనస్ఫూ ర్తి దాని ప్రతి అవయవంలోనూ పాలపొంగు వలె ఉద్రేకిస్తూంది. ఎలప్రాయపురుచులకి తోడు, మెరుపు గోధుమరంగు ఛాయలతో శరీరం కాంతు లీనుతూంది. సుకుమారమై, సౌందర్యప్రసన్నమగు ముఖము హృదయా నందదాయకమైఉంది. కళాభరితములగు కా టుక కళ్ళనుండి తొలకరిమెరుపులు మెరుస్తు న్నాయి. అవయవాలు నాతికఠినములై సౌ ఖ్యజీవనానికి అలవాటైన దానిలాగు తోపింప చేస్తున్నాయి. గుంపులోని ఇతర స్త్రీలనుండి వేరుచేసే సౌందర్యలక్షణాలు దానిలో ప్రత్య క్షంగా ఉన్నాయి.

ఆపిల్లనుండి దృష్టులను మళ్ళించుకోలేక పోయాడు మారిగాడు. చెరువువొడ్డుననిలబడి కోకను తొడలకిపైగా బిగించి, పైటకొం గును నడుముచుట్టూ తిప్పికట్టింది. గట్టుమీద నున్న యువకుడు తన్ను చూస్తున్నట్లు నిము షంలో గ్రహించేసిందది. బిందెతోముకుం టూ మధ్య మధ్య రెండు చురుకుచూపులను ప్రసరించింది అటువైపు. చిత్రప్రతిమఅయి పోయిన వాడి హృదయాన్ని కలవరపెట్టే శాయి ఆచూపులు.

ఆఖర్ని నీళ్లుముంచుకుని అందరికీ వెనకగా వెళుతూంది ఆపిల్ల. భుజముమీద బిందెతో, సౌందర్యం తొణుకులాడుతూ ఉన్న శరీరపు వంపులతో దాని వయ్యారపునడకలు మారి గాణ్ణి ముగ్ధుణ్ణిచేసేశాయి. వాడిదృష్టి దాని

మీదనే కేంద్రీకృతమైఉంది.

ఆస్త్రీలు తిరుగుముఖంలో మారిగాణ్ని సమీపించారు. చూస్తూఉండగానే వాళ్ళంతా వాడిపక్కనుంచే వెళ్ళిపోయారు. వాళ్ళ వెను వెనకనేఉండి, కొంచెమంత ప్రయత్నంచేసుకుని, బిందెనుపట్టుకున్న చేతికీ, బిందెకీ మధ్యగాఉన్న సందులోకి తన మెరుపుకళ్ళను తీసుకొచ్చి ఆపిల్ల ఒక్కసారి మారిగాణ్ని చూసి చటాలున మొహం మళ్లా తిప్పేసుకుంది.ఆముహూర్తాన్ని వాళ్ళిద్దరిచూపులూ కలిసిపోయాయి.

ఆస్త్రీసంఘమంతా తిన్నగా మాలపల్లి లోకే పోయింది.

మారిగాడికళ్ళలో వింతకాంతులు ప్రజ్వరిల్లాయి. ఆనందద్యోతకమైన తేజము ముఖంమీద తాండవించింది. వాళ్ళవెంబడేనే వాడు కూడా మాలపల్లిలోకి వెళ్లాడు. ఆపిల్లవాడి అత్తవారింటికే వెళ్ళడంచేత పెళ్ళికి వచ్చిన బంధువులాలని వాడికి బోధపడిపోయింది.

## 3

గౌరి మారిగాడి పినమామగారి కూతురు. దానికిప్పుడు పదిహేనోయేడు. చిన్నతనంలోనే దానికి పెళ్ళిఅయినది. పెళ్లిఅయిన రెండేళ్ళలో దానిభర్త రంగం వెళ్ళిపోయాడు. అనేకఉత్తరాలు రాసినా వాడిదగ్గరనించి యేవిధమైన జవాబుగాని చాలాకాలంవరకూ రాలేదు

ఇంతలో గౌరి పెద్దమనిషయింది. ఈవర్తమానం తెలియచేస్తూ, తక్షణం రావలెనని గౌరితండ్రి మళ్లా అల్లుడికి ఉత్తరంరాశాడు. దానికి జవాబుగా భర్తదగ్గిరనించి గౌరిపేర రెండువందల రూపాయలు మనియార్డరు వచ్చింది. ఇంకొక సంవత్సరంలో వస్తున్నానని అందులో దానిభర్త రాశాడు.

అనుకున్న యేడాదీగడిచిపోయింది. మరి ఆరునెలలుకూడా నడిచాయి. రంగంలో ప్లేగు బయలుదేరి జనులు చెట్లఆకుల్లాగు రాలిపోయారు. కొన్నాళ్ళకి గౌరిపేర ఒక రంగూన్ కంపెనీ ఉత్తరంవచ్చింది. అందులో ప్లేగువల్ల దానిభర్త చనిపోయాడని ఉంది. అంతేకాక వాడు కూడబెట్టిన సొమ్ము మరి రెండువందల రూపాయలున్నూ కంపెనీవారు గౌరిపేర మనియార్డరు చేశారు.

ఇదిజరిగి ఇప్పటికి సంవత్సరంపైగా అయింది. అందకత్తెఅయిన గౌరిని పెళ్లాడాలని చాలామంది ప్రయత్నిస్తున్నారు. ఆస్త్రీపరువాలగు కుసుమాస్త్రేని తగిన సంబంధంవస్తేగాని యివ్వడానికి దానితండ్రి కిష్టంలేదు.

* * *

సాయంకాలం చెరువుగట్టుమీద గౌరిని చూసినప్పటినించీ మారిగాడిలో వింతమార్పు గోచరించింది. రాముని పెళ్ళిచేసుకోక ముందుండే ఉత్సాహమంతా తిరిగివచ్చినట్లు కనిపించింది. వాడిముఖంలో చిరునవ్వు తొలకరించింది. దీపాలవెలుగులో కళ్లు కాంతివంతములై ప్రకాశించాయి.

ఇప్పుడు వాడి మనస్సంతా గౌరిదే వీధి అరుగుమీద కూచుని పందిట్లో పేరంటాళ్ళ మధ్య చురుగ్గా మసులుతూఉన్న గౌరి అందాన్ని వెయ్యికళ్ళతో చూస్తూఉండడమే వాడిపని. ఆనల్లకళ్ళలో తళుకుచూపుల్లో బుగ్గల నిగనిగలలో, మధురస్వరంలో, మందహాసాల్లో వాడిమనస్సు చిక్కుపడి గాభరా పడిపోయింది.

తన సౌందర్యాన్ని అనురాగంతో గ్రోలుతూ, తనకోసమని ఊటలూరుతూఉన్న యువకుణ్ని గ్రహించిందిగౌరి. వాడి ప్రేమచేష్టలలో అది అంతకుపూర్వ మెన్నడూ యెరగని సౌఖ్యానుభవమును పొందింది. రానురాను ఆ ఆనందము దానికి ప్రాణసమానమై విడిచిపెట్టరానిదైపోయింది. పెళ్ళికిముందు రెండు రోజుల్లోనూ వాళ్ళహృదయాలు మాట్లాడుకొని బోధపరుచుకున్నాయి.

వివాహపురోజువచ్చినది. పెళ్ళికొడుకూ, పెళ్ళికూతురూ పీటలమీద కూచున్నప్పుడు పాటలు పాడ్డంలోనూ, వడ్డనలూ ఇతరయేర్పాట్లలోనూ గౌరి ఉత్సాహంతో తిరుగుతూంది. ఎంత తొందరలో ఉన్నప్పటికీ మధ్య మధ్య మారిగాణ్ని ప్రేమవీక్షణాలతో అనుగ్రహించకుండా ఉండ లేదది.

చలవచేసిన గులాబీరంగుచీర జరీ అంచులు పాదాలమీద జీరాడేటట్టు కట్టుకుంది. శరీరపు జిగిబిగిని మరుగుపరచబోతూ వెల్లడించే తెల్లని ఇస్త్రీ రైకతొడుక్కుంది- రెండు ఎర్ర పగడాలపేర్లు ఆరైకపైని స్ఫుటంగా కనిపిస్తున్నాయి- మెడలోనూ, బుగ్గలమీదా గంధం రాసుకుని గౌరి తొలకరిమామిడి గున్నలాగ చూడతగిఉంది-

వివాహంజరుగుతూంది- మధ్యలో కొంతసేపు పాడమని ఆడవాళ్ళంతా గౌరిని బలవంతపెట్టారు- అదిపాడుతూఉంటే వినాలని అందరూ నిశ్శబ్దంగా కూచున్నారు-

'గౌరీ కల్యాణం' పాడ్డం మొదలుపెట్టింది గౌరి- నిముషంలో ఆ వివాహమండపము గంధర్వలోకంగా మారిపోయింది- మధురవీణా నినాదమువలె, వసంతోదయమున గాలి కెరటాల్లో తేలిపోయే కోయిలపాటలాగు, దానికంఠస్వరము నిండుజీవముతో హాయిగూర్చినది. కుతూహలంతో ఆస్త్రీసమాజానికి కొంచెము దగ్గిరగా చేరాడు మారిగాడు. వాడు రావడం కనిపెట్టడంచేత గౌరిపాటలో కొంచెం సిగ్గు వినబడింది.

పాడుతూ, పాడుతూ మధ్య గౌరి కొంచెం తలయెత్తి మారిగాడివేపు చూస్తూఉండేది. ఆనందపరవశత సువ్యక్తమవుతూ ఉన్న వాడిముఖం దానికి ఉత్సాహంకలిగించేది. ఆవేళ గౌరిపాట అదివరకుకంటె ఎన్నోరెట్లు బాగుందని అందరూ చెప్పుకున్నారు.

పన్నెండు గంటలప్పుడు అందరూ భోజనాలకి కూచున్నారు. యథాప్రకారంగా మారిగాడు వడ్డనకి నడుముబిగించాడు. ఇంతలో అత్తగారువచ్చి వాడితో "నువ్వు వడ్డించవద్దు. కూచో, రోజూ నీకు భోజనం ఆలస్యమైపోతూందంటూంది మీావదినగారు' అన్నాది. దానివెనకనే నిలబడి గౌరి చిరునవ్వు నవ్వుతూంది.

గౌరితో కలిసి మెలిసి వడ్డించాలని మారిగాడి అభిలాష. మారిగాణ్ని కూచోపెట్టి వాడికి తను స్వయంగా వడ్డించాలని గౌరి పట్టు. మారిగాడు పంక్తికి చివరగా ఒక విస్తరి వేసుకుని కూచోకతప్పిందికాదు. గౌరి దగ్గిరకి వచ్చినపుడు వాడు మెల్లిగా దానికిమాత్రమే వినబడేటట్లు 'ఇదంతా ఆడవాళ్ళరాజ్యం. వాళ్లుచెప్పినట్లు వినకపోతే తంటావస్తుంది.' అన్నాడు. గౌరి సాభిప్రాయంగా వాడివేపు చూసి నవ్వుకుంటూ 'ఇప్పటికి తెలిసింది కాబోలు!' అన్నాది.

* * *

గౌరి ఒక్కక్షణం కనబడకపోతే మారిగాడికి ప్రపంచకం అంధకారమైపోయేది. ఆ నిముషమూ వాడు మతిపోయినట్లుగా తిరిగేవాడు. దాని విలాసంచూడ్డంలోనే వాడికి పొద్దుజరుగుతూ ఉండేది.

మారిగాడి ప్రేమలో తన్మయురాలై సౌఖ్యపడేది గౌరి. వాడిప్రేమచేష్టలకి అది రహస్యంగామాత్రం అంగీకారం సూచిస్తూఉండేది. నలుగురిలో ఉన్నప్పుడు వాణ్ని క్రీగంటిచూపులతో మాత్రమే అనుగ్రహించేది.

౪

మర్నాడు సాయంకాలానికి పెళ్ళిలో జరగవలసిన లాంఛనాలన్నీ పూర్తి అయాయి. సాయంకాలం నాలుగుగంటలవేళ '**వ**సంతం కలపండోస్' అనే కేకలు బయలుదేరాయి. కావిళ్ళతో కోనేటినీరు తెచ్చి యువకులు వసంతంకలిపారు.

బొప్పానపుకాయ గొట్టాలూ, వెదురు గొట్టాలూ వసంతముతోనింపి ఒకరిమీద ఒకరు జల్లుకోవడం ప్రారంభించారు. మాలపల్లిలో తొమ్మిదేళ్ళ పిల్లాడుమొదలు తొంభైయేళ్ళ వృద్ధుడివరకూ ఈ ఉత్సవంలో మునిగి సర్వప్రపంచమూ మరిచిపోయారు.

సన్ననిచీకట్లు పడుతున్నాయి. వసంతాలు జల్లుకోవడం తగ్గించి అందరూ కోనేట్లో స్నానాలుచేసి, ఒడ్డున నిలబడి బట్టలు ఆరేసుకుంటున్నారు. ఆసందర్భంలో జరిగిన ముచ్చట్లు చెప్పుకుంటున్నారు.

మారిగాడుమాత్రం ఒక వెదురుగొట్టం నిండా వసంతం నింపుకుని ఎవరికోసమో వెతుకుతున్నాడు. ఇంకా దీపాలు వెలిగించలేదు. గదుల్లోనూ, పందిళ్ళకిందా, తలుపుల చాటునీ వాడు బహుశ్రద్ధగా వెతుకుతున్నాడు.

మారిగాడి అత్తవారింటిదొడ్డిలో ఒక గాదెఉంది. వాడు నెమ్మదిగా అడుగులువేస్తూ ఆగాదెవెనక్కి వెళ్ళి వంగిచూశాడు. వెంటనే నవ్వుతూ, 'దొంగా! యిక్కడా ఉన్నావు?' అంటూ వెదురుగొట్టంలోఉన్న వసంతాన్ని పిచికారీ కొట్టాడు.

అప్పుడు ఆగాదెవెనకనించి 'అబ్బా! మోటసరసం' అని ముఖంనిండా పడ్డ వసంతాన్ని పైటకొంగుతో తుడుచుకుంటూ గౌరి పైకి వొచ్చింది.

కొద్దిగా చీకటిపడింది. మారిగాడు నాలుగువేపులా చూశాడు. దొడ్లో యెవ్వరూలేరు. చిరునవ్వూ, సరిగా అభినయించలేని తెచ్చిపెట్టుకున్న కోపమూ దానికళ్ళలో ఒక్కసారిగా గోచరించాయి.

ఒక్కనిముషం చూశాడు ఆముఖంవేపు. మనసు పట్టలేకపోయాడు. వెదురుగొట్టాన్ని నేల పారేసి గౌరిని కౌగిట్లో యిరికించుకుని ఒక్కముద్దు పెట్టుకున్నాడు.

ఇష్టంలేని ప్రయత్నంతో గౌరి తప్పించుకోడానికి చూసింది. కాని మారిగాడు సాగనియ్యలేదు. ఆకౌగిలి వెచ్చదనంలో తన్మయురాలై పోయి అలాగే ఊరుకుంది.

[సశేషము.]



# ది హెల్తు ప్రాడక్ట్సు కో వారి పంచరత్నములు

రజాపీడితుడైన చ్యవనుని యౌవనవంతునిగ నొనర్చినది.

భారతీయుల
రుచికరమగు
టానిక్కు




ఆయుర్వేద
వాజీకరణ
రసాయనము

ప్రవాళమిశ్రిత చ్యవనప్రాశయొక్క ఒక్క మోతాదు టానిక్కులని విరివిగ ప్రకటింపబడు వాటి నూరు మోతాదులతో సమానము. చ్యవనప్రాశ, ప్రవాళము మిళితముచేయుబడిన యీమహత్తరౌషధము అనేక యితర టానిక్కులు సేవించి నిస్పృహ చెందినవారికి కల్పద్రుమము. దీని సేవనమువల్ల బలహీనదేహులు పుష్టిచెందుదురు. వృద్ధులు యౌవనులగుదురు. చిక్కి శల్యావశిష్టమైనవారికి చక్కని ఆరోగ్యమును ప్రసాదించును. క్షయ, శ్వాసకోసలు, రక్తహీనత, హృదయదుర్బలత, నిరుత్సాహము మొదలగు వాటిని రూపుమాపి బలమును, కాంతిని, శుక్రవృద్ధిని, ధాతుపుష్టిని కలిగించును. రెండు సైజులలో దొరకును.

పౌను రూ 2—8—0, అర పౌను రూ 1—5—0.



సమస్తవిధ జ్వరములకు.

ఎవ్విధ జ్వరమైనను సరే ఎంతకాలమునుండి జీర్ణించియున్నను సరే మూడవమోతాదుతోసరి. పరీక్షించిన దీని యదార్థము తెలియగలదు.

4 ఔన్సుల సీసా రు 0-12-0.




గనేరియాకు.

ఏరకము సెగవ్యాధినైన తప్పక కుదుర్చును. మూత్రము ధారాళముగవచ్చును. మంట శమించును. తెలుపుపోవుట, వాపు, పుండు మున్నగునవి హరించును.

20 దినములకు 60 మాత్రలు రూ 4-0-0.



స్త్రీలముట్టుకుట్టు, వంధ్యాత్వమునకు.

స్త్రీలకు గలుగు ముట్టు కుట్టునొప్పి. మైల అధికముగ గాని, తగ్గి గానిఅగుట, కుసుమరోగము, సంతానహీనత మొదలగువాటిని కుదుర్చును. వంధ్యలు తప్పక సంతానవతులగుదురు.

20 దినములకు 60 మాత్రలు రూ 2-0-0.




స్త్రీలకు ప్రసవానంతరము.

సూతికాసంబంధవ్యాధి బహుప్రమాదకరమైనది. ప్రసవించినప్పటినుండి సేవింపజేసిన చాల మేలుకలుగును. సూతికావ్యాధులు దరిజేరవు. సడలిన దేహము గట్టిపఱచును. పుష్టియేర్పడును. స్తన్యవృద్ధి కలుగును.

వెల సీసా 1-కి రు 1-0-0.

కేటలాగు ఉచితము. ప్రతి ముఖ్యపట్టణమందును యేజంట్లు కావలెను. తపాలు ప్యాకింగుఖర్చులు వేరు.

ది హెల్తు ప్రాడక్ట్సు కో, ✠ వేపేరి, ✠ మదరాసు.

# చంపావతీ నాటిక

[అక్బరుచక్రవర్తి ప్రత్యర్థియగు ప్రతాపసింహమహారాజుయొక్క పుత్రికయు, వీరబాలికయు అగు చంపావతి కథ.]

రచయిత :

యస్. వెంకటసుబ్బయ్యచౌదరి

## ప్రథమదృశ్యం

స్థానం—ఆరావళీపర్వతప్రదేశం

(నిర్మలమైన ఆకాశం, జనరహితప్రదేశం, లోయలోనుండి వేగంగా ప్రవహించేచిన్న నది, పొడవుగా పెరిగిన పచ్చగడ్డితోగూడిన అరణ్యం. ఒకవైపునుం డొకచిన్నపిల్లవాడు ఎగురుకుంటూ వస్తుంటాడు. చంపావతి (మహారాణాప్రతాపసింహుని కుమార్తె) అతనిని పట్టుకోవడానికి పరుగెత్తుకుంటూ వస్తూవుంటుంది. కాని పిల్లవాడు చంపావతికి కనుపించకుండాపోయి గుబురుగాపెరిగిన గడ్డిలో దాక్కుంటాడు. చంపావతి చకితురాలై నలువైపులా చూచి గడ్డిని బీరాడుతూ వస్తూవుంటుంది. సుందరుడు మారుస్వరంతో ఆమెను దడిపించుతాడు. ఆమె సుందరునెత్తుకొన్ని పచ్చగడ్డితో గూడిన సమతలభూమిమీద కూర్చుంటుంది.)

చంపక్కయ్యా!

యేమిటిరాతమ్ముడూ?

నాకుబాగా ఆకలివేస్తూంది. ఎక్కడినుండైనా నాకొక రొట్టె తెచ్చిద్దూ.

రొట్టెలకొరకలవటిస్తుంది కాలం.

బాగా ఆకలివేస్తుంది.

పిచ్చివాడవులాగున్నావు.

నేను పిచ్చివాణ్ణికాను.

అయితే యింకో క్రొత్తాటాడుకుందాం రా.

నేనాడను. ఆకలిబాధకోర్వలేకుండా వున్నా.

ఆడకపోతే నిద్రపో.

ఆకలితో మాడుతుంటే నిద్రపోయేదెట్లా?

తండ్రిగారొకపర్యాయం గడ్డిరొట్టె నొకదానిని అన్నకిచ్చారు, జ్ఞాపకముందా?

ఆ, జ్ఞాపకముంది.

ఆతర్వాత జరిగిన విషయమేమిటి?

నాకు తెలవదు.

చూడు...

## విశేషదృశ్యం

స్థానం—కుటీరం సమయం—ప్రాతఃకాలం

(మహారాణా ప్రతాపుడు చినిగిన వస్త్రాలతో శరీరం కప్పుకొనివుంటాడు. ఆయన దగ్గర వొకపిల్లవాడేడుస్తూవుంటాడు.)

నాయనగారూ! నాయన గారూ!

దేశసేవకు ప్రతిఫలంగా నాబిడ్డలకాహారంలేకుండా చేశావా ప్రభూ?

(పొట్టపట్టుకుని) నే నీఆకలి కోర్వలేను.

అమ్మా! అమ్మా! (పడి మూర్ఛపోతాడు.)

కొంచెమాగు నాయనా! నిద్రపో.

(కుటీరం వెలుపల అప్పుడే పెరుగుతున్న గడ్డినిత్రవ్వి రొట్టెవొకదానిని తయారు చేస్తాడు.)

రొట్టెదుగో తింటూవుండు. నీళ్లుతీసుకొస్తా.

(పిల్లవాడు రొట్టెను తినబోతాడు. యింతలో అడవిపిల్లొకటి వచ్చి ఆరొట్టెను లాక్కొని పారిపోతుంది. విశేషదృశ్యం సమాప్తం)

---

[సుందరుడు, చంపావతి.]

ఇదేమిటక్కయ్యా! రొట్టెను అడవిపిల్లి లాక్కొని పోయింది.

కాగాచేస్సివుండాలి అక్కయ్యా.

నీలాటి మూర్ఖుడుగాడు ఏడవడానికి.

నేను మూర్ఖుణ్ణా?

మూర్ఖుడివి కాకపోతే పిచ్చివాడివి.

నేను పిచ్చివాణ్ణికాను. రాజకుమారుణ్ణి.

రాజకుమారుడవైతే రొట్టె అడుగుతావా?

ఆకలివేస్తుంటె నేనేమి చేసేది?

భగవంతుడా! నాతమ్ముణ్ణి రక్షించు.

భగవంతుడుకూడా వొకరాజేనే?

ఆ రాజులకు రాజు.

అయితే మనకు సహాయం చేయడేం? తండ్రిగారు ఆకలిగొన్నవారిని వూరికే పంపించరే! భగవంతుణ్ణి మనమెంత పిలుస్తున్నా రావడంలేదు.

ఆయన రాజులకు రాజుకాడు.

అట్లాఅనకు. కండ్లుపోతై.

ఎందుకనగూడదు? భగవంతుడు రాజుకొడుకుగాడు. పిచ్చివాడు. మనమేడుస్తుండడం చూచైనా రొట్టివ్వడు.

హా దుర్భాగ్యమా! మహారాణాప్రతాపునివంటి హిందూరాజుని పుత్రునకుగూడ తిండిలేని దినాలు చూడవలసి వచ్చెగా! పద, కుటీరానికి పోదాం.

వస్తాగాని రొట్టిస్తావా?

ఆ.

అయితేపద.

(పిల్లవాడు చేతులెత్తుతాడు. చంపావతి పిల్లవానినెత్తుకుని వెళ్లుతుంది.)

## రెండవదృశ్యం

### స్థానం—ఆగ్రానగరంలోని కోట

(అక్బరుచక్రవర్తి సింహాసనాసీనుడై వుంటాడు. భటులు శస్త్రపాణులై యథాస్థానాల్లో నిలబడివుంటారు. రాజాభగవాన్‌సింహుడు, రాజామానసింహుడు కూర్చునివుంటారు.)

అక్బరు—రాజా మానసింహా! యిది నీకు కళంకం గాదు. మొగల సామ్రాజ్యానికంతా అగౌరవం.

మాన—పనాహెఆలం! పరమాత్మస్వరూపుడైన రాజుతో పగపెట్టుకుని వృద్ధికి రాగలవాడెవడైనా వున్నాడా?

అ—నీవు చెప్పేది నాకర్థం కావడంలేదు.

మా—స్వదేశగౌరవాన్ని కాపాడడానికి ప్రయత్నించడంవల్లనే ప్రతాపుడు అరణ్యాల్లో వాసంచేస్తున్నాడు. ఆతనిబిడ్డలు గడ్డిరొట్టైనా తిననోచుకోలేదు.

భగ—ఖుదావంద్! తనబిడ్డలు దీనావస్థలో వున్నారనే దుఃఖంగూడ లేదు ప్రతాపునికి. ఆయన మీతో సంధిచేసుకుంటే యెంతో బాగుండేది.

అ—భగవాన్‌దాస్! కష్టపుదినాలందరికీవుంటై. దుఃఖంతోగాని, సంతోషంతోగాని గడపవలసిందె. కష్టాలలో సంతోషంగా వుండేవాడు త్వరగా సు ందుతాడు.

భ—తమరు సెలవిచ్చింది నిజమే.

అ—యేమైనాసరే, ప్రతాపునికి సహాయంచేయడమవసరం.

మా—తమ చక్రవర్తిత్వాన్ని వొప్పుకోని వానికి సహాయంచేయడం పాముకు పాలుత్రాగించినట్లే.

అ—నీవు చెప్పేది పొరపాటు మానసింహా!

మా—జహాపనాహా!

అ—ప్రతాపుడు మన సహాయమపేక్షించుతాడా? భగవాన్‌సింహా! తాను వుపవాసముచేసి చావడానికైనా వొప్పుకుంటాడుగాని మనసహాయమపేక్షించడం కల్ల.

(సరదారుడు ప్రవేశించి వంగి సలాంచేస్తాడుఅక్బరుకు)

సర—ఖుదావంద్! తమ విజయం.

అ—సమాచారాలేమిటి?

స—తమరాజ్ఞాపించినట్లు మారువేషంతో ప్రతాపునిస్థితి చూడడానికెళ్లాను.

అ—నీవేమి చూశావు?

స—నాకళ్లార వొకభయంకరమృత్యువును చూశాను అది తలచుకుంటే నా గుండె బద్దలౌతుంది.

అ—భయంకరమృత్యువునా?

స—చిత్తం.

అ—ఎవరిమృత్యువు? యెప్పుడు? యెక్కడ?

స—ప్రతాపుని చిన్నకుమారుని మృత్యువు. ప్రాతఃకాలసమయం. అరణ్యంలో.

అ—అతను చనిపోవడానికి కారణం?

స—సామ్రాట్ రాజామానసింహాజీ అరణ్యంలోని చెరువులన్నిట్లో విషం కలుపవలసిందిగా ఆజ్ఞాపించారు, హరి . .

అ—మానసింహా! నీవుచేసిన పనేనా? ఆ అజ్ఞానశిశువుని ఆత్మనిన్నాశీర్వదిస్తుందా?

మా—శాహెఆలం!

అ—నేనేమి వినదలచుకోలేను. నాశత్రుత్వం ప్రతాపునితో- అతనిపిల్లలతో కాదు.

భ—తప్పులందరూ చేస్తారు ప్రభూ!

అ—నీపరిహాసానికి సమయం గాదు, భగవాన్‌సింహ్! తెలియని స్నేహితునికంటె తెలిసిన విరోధిమేలు.

## మూడవ దృశ్యం

స్థానం—అరణ్యం     సమయం—సాయంకాలంతర్వాత.

(కుటీరంలోపల ప్రతాపుడు తనపత్నీసమేతంగా చింతాక్రాంతుడై కూర్చొనివుంటాడు.)

ప్రతా—ఆర్యపుత్రీ !

రాణి—మహారాజాజీ !

ప్ర—మన కీకష్టకాల మెంత వరకు ?

రా—అధీరులు కావద్దు. యెల్లకాలం వొకేరీతిగా నుండబోదు. ఈనాడు బీదవాడుగానున్నవాడు రేపు భాగ్యవంతుడు కావచ్చు. రాజుగానున్నవాడే బీదవాడు కావచ్చు.

ప్ర—ఎంతవరకు సహించడం? ఈ సహనమే మన ఆత్మనాశనానికి కారణభూతమైంది. పసిపాపల్ని కూడా రక్షించుకోలేక పోయాం.

రా—మీరే నిరాశావాక్యాలు పలికితే ఈపిల్లల్ని రక్షించే దెవరు ?

ప్ర—మనస్సును దిట్టపరచుకోవడానికి లక్ష ప్రయత్నాలుచేసినా నాసాధ్యం కాకుండా వుంది.

రా—బాప్పారావుల సంతతి వారి కధైర్యమా ?

ప్ర—నాచింతకు కారణం చితోడే, మహారాణీ ?

రా—చింతించవద్దు. చితోడు మరల మీస్వాధీనమౌతుంది.

ప్ర—సంభవంకావచ్చు. నావిశ్వాసమట్లా చెప్పడంలేదు.

(సుందరుని యెత్తుకని చంపావతి ప్రవేశిస్తుంది)

సుంద—అక్కా ! అక్కా ! రొట్టియ్యవే.

చం—నీళ్లుత్రాగి నిద్రపో.

ప్ర—అనీళ్ళను త్రాగించకు, చంపా !

చం—యేం ?

ప్ర—విషంకలిసివుంది.

చం—విషమా ? యెక్కడి నుండి వచ్చింది ?

ప్ర—చెరువులన్నిటిలో విషం కలిపి మనలను చంపడానికి క్రొత్తదారి వెదికారు శత్రువులు.

చం—మీకెట్లా తెలిసింది ?

ప్ర—ఒకజంతు వానీళ్ళను త్రాగిచావడంవల్ల.

చం—సరే...పదరా తమ్ముఝా! నిన్ను నిద్రపుచ్చుతా. నిద్రలేచిన తర్వాత రొట్టిస్తా.

సుం—యెత్తుకో నేనునడవను.

చం—ఎత్తుకోను.

సుం—యెత్తుకుంటేగానిరాను

(సుందరుడు చంపావతి పమిటెను పట్టుకుంటాడు. ఆమె నవ్వుతూ పరుగెత్తింది. వెనుక సుందరుడు పరుగెత్తాడు.)

ప్ర—మహారాణీ ! సుందరుని తమ్ముడు విషపునీరుత్రాగి చనిపోయాడని పొరపాటునైనా చంపకు చెప్పవద్దు. వింటే ఆమెదుఃఖాని కంతుండదు.

రా—తమ్ములకొరకు ప్రాణమివ్వడానికైనా వెనుదీయదు.

ప్ర—(నిట్టూరుస్తూ) ప్రభో! మమ్ములరక్షించే దెపుడు ?

## నాల్గవ దృశ్యం

స్థానం—అరణ్యంలోని కుటీరం     సమయం—దాదాపు సాయంకాలం

(కుటీరపులోపలిభాగం—చంపావతి సుందరుణ్ణి చాపమీద నిద్రపుచ్చుతూవుంటుంది.)

చం—యేడవకు యేడిస్తే నాన్నగారు కోప్పడతారు.

సుం—అక్కయ్యా ! అక్కయ్యా! రొట్టె.

చం—యేడిస్తే నీతో నేను మాట్లాడను.

సుం—అక్కయ్యా!

(సుందరుని యేడ్పు మాన్పించడానికి తననోటిని సుందరుని నోటికి కానిస్తుంది చంపావతి. సుందరుడేడ్పుమ డు.)

## ఐదవదృశ్యం

స్థానం—మార్గం     సమయం—సాయంకాలం

(మార్గాన చాలమంది స్త్రీపురుషులు పోతూంటారు. చంపావతి తెల్లని వస్త్రాలు ధరించిన హిందువునినిల్పి ప్రశ్నిస్తుంది)

చం—నాకొకరొట్టెను దయచేయండి.

హిం—నీకివ్వడానికేమైనా నీరొట్టెలను నావద్ద దాచిపెట్టావా?

(చంపావతి హతాశురాలై వొకద్వారందగ్గరకు వెళ్ళి తలుపు తట్టుతుంది. ఒకస్త్రీ బయటకువస్తుంది.)

స్త్రీ—అమ్మాయీ! యెందుకొచ్చావు ?

చం—తల్లీ! రొట్టెవొకటి కావాలి.

స్త్రీ—నీ వెవరవు ?

చం—నేనెవరినైతేనేమమ్మా! యిప్పుడు భిక్షుకురాల్ని. నాతమ్ముడు ఆకలితో అలవటిస్తున్నాడు. వానికొరకొక రొట్టెనడుగుతున్నా.

స్త్రీ—మారొట్టెను తీసుకొంటావా ?

చం—ఎందుకుతీసికోను ?

స్త్రీ—నీమతం హిందూమతంలాగుంది. మాది మహమ్మదీయమతం.

చం—మహమ్మదీయులు మనుష్యులే. హిందూదేశంలో నివసించే హిందూమహమ్మదీయులందరూ సోదరులే. మూర్ఖులు వేరుగా తలుస్తారు.

స్త్రీ—నిజమే. హిందూదేశానికి తమ వైషమ్యాన్ని త్యజించి పరస్పర ప్రేమతో మెలిగే హిందూమహమ్మదీయులవసరం.

(లోపలికి వెళుతుంది)

చం—ప్రభూ! ఆరెండు మతాలవారు తమద్వేషాన్ని త్యజించి ప్రేమతో మెలిగే సుదినమెప్పుడు కళ్ళారచూస్తాం ?

స్త్రీ—త్వరలోవస్తుందా సుదినం. మాయింట్లో రొట్టెలులేవు. ఈబియ్యం, కట్టెలు తీసుకొనిపోయి నీ తమ్మునికి అన్నంవండి పెట్టు. యివిగో ఈపళ్లెంలో బియ్యం, పప్పువున్నై.

చం—మహమ్మదీయ స్త్రీలయ్యు వొక అనాథ హిందూబాలికకు సహాయం చేసిన తమర్ని భగవంతుడు రక్షించుగాక.

---

## ఆరవదృశ్యం

స్థానం—వుపవనం     సమయం—సాయంకాలం

(చంపావతి పుష్పమాల తయారుచేస్తూవుంటుంది - సుందరుడు ఆడుకుంటూవుంటాడు.)

సుందర్ !

యేమిటక్కయ్యా ?

యిట్రా.

నేనురానుఆడుకుంటున్నా.

జల్దీరా- నిన్నురాజును చేస్తా,

రాజునుచేస్తావా ?

ఆ.

యెట్లాచేస్తావు?

ఈ చట్రాతిమీదకూర్చోబెట్టి పూలమాలవేస్తా, రాజువౌతావు,

(బుగ్గగోక్కుంటూ) యిస్ అబ్బా!

అట్లా గోక్కుంటావెందుకు !

యేమిటోకుట్టింది,

(బుగ్గచూచి) తేనీగకుట్టినట్లుంది,

(సుందరుణ్ణి యెత్తుకుని పరుగెత్తుతుంది) —సశేషము.

జి
జ్ఞా
స

> విజ్ఞానసంపాదనావసరమున వివిధవిషయములందు కలుగు సందేహములను నివారించుకొనన పత్రికాముఖమున జిజ్ఞాస సలుపుటకును— ఇందలి ఏ ఒక్క జిజ్ఞాసకైనను సరే సరియైన సమాధానము తెలిసియున్నచో దానిని కూడినంత సంగ్రహముగ వ్రాసి, ప్రచురణార్థము పంపుటకును ఆంధ్రభూమి పాఠకులను ప్రార్థింతుము. —సంపాదకుడు.

### ౭౫. పిల్లలకు కలినీళ్లు చల్లడం

పిల్లలు పుట్టినవెంటనే కలినీళ్లు (అనగా బియ్యం కడిగిన నీళ్లు) చల్లుతారు. చాలామందిని అడుగగా పూర్వజ్ఞానము కలుగకుండా ఇట్లు చల్లుతారు అని చెప్పినారు. ఇది నిజమా లేక దీనికి (ఈచల్లడమునకు) యింకొకకారణ మున్నదా?

—సత్తి సత్యనారాయణరెడ్డి.

### ౭౬. కందాయఫలం వగైరా

పంచాంగంలో ఒక నక్షత్రానికి కందాయఫలం చూస్తే విషమసంఖ్య వస్తుంది. సిద్ధాంతులు 'విషమే స్వర్థలాభః' అని దానికిందే రాస్తారు. మళ్ళీ ఆదాయవ్యయపట్టికచూస్తే ఆదాయం 4, వ్యయం 12 అని ఉంటుంది పైనక్షత్రానికే. దీన్నిపట్టి ఆనక్షత్ర (రాశి) జాతకునికి, లాభమా? వ్యయమా? ఈ రెండింటికి సమన్వయం ఎట్లు?

—కావలి శ్రీరామమూర్తి.

### ౭౭. ప్రథమాంధ్రనాటకము

శ్రీకృష్ణదేవరాయల కాలములోకాని, అంతకు పూర్వముకాని ఆంధ్రమందు నాటకములుండినవా? ఉండినచో వాటిని వ్రాసిన కవులెవరు? అవి ఏవి?

—అడిదము వేంకటరామారావు.

### ౭౮. పునర్వివాహనిషేధము—పురుషులకు లేదా?

హిందూసంఘమున స్త్రీకి పునర్వివాహనిషేధమున్నది. భర్తయన ఏమిటో ఎరుగని బాలవితంతువులకు తిరిగి వివాహముచేయుటకు సంశయించుచున్నారు. అందుకు కారణము సంఘబహిష్కారమే. ఈసంఘబహిష్కారము పునర్వివాహము చేసికొను పురుషులకు లేదని ఏహిందూధర్మశాస్త్రములోనైనా వున్నదా?

—బేతిరెడ్డి గోవిందరెడ్డి.

### ౬౯. ఆశౌచవిచారము

కన్యలకుగూడ పితృజ్ఞాతుల మరణమువలన నాశౌచముగలదను ప్రత్యేక వచన మెచ్చటను లేదు. కన్యలు తలిదండ్రులతోబాటూ ఆశౌచమును బట్టుటకు ప్రత్యేక వచనముండవలసిన యవసరమేలేదు. ఏలన వివాహమగువఱకును వారు పితృగోత్రములోనే యుందురని స్మృతులలో స్పష్టముగనున్నది. పితృగోత్రభ్రంశ సప్తపదితో నగుచున్నది.

"స్వగోత్రాద్భ్రశ్యతే నారీ ఉద్వాహాత్సప్తమే పదే" (లిఖితస్మృతి 1-27)

కాన బాలురవలెనే కన్యలకుగూడ పితృజ్ఞాతి మృతాశౌచముండును. ఎచటనైనను నీయాశౌచము కన్యల కక్కఱలేదను ప్రత్యేకవచనముండుచో నపైనచేయబడిన సిద్ధాన్తమును తప్పక బాధించును. కాని యట్టి ప్రత్యేకవచన మెచ్చటను గాన్పింపదు. వేదాధ్యయనము చేసికొను నియమయుక్తుడైన బ్రహ్మచారికి పితృగోత్రాశౌచము లేదని స్పష్టముగా కొన్ని స్మృతులు చెప్పినవి. అట్లే కన్యకుకూడ ఆశౌచ మక్కఱలేదను వచనమెచ్చటను లేదు. కాన కన్య లాశౌచమును పట్టవలసియేయుండును.

—జటావల్లభుల పురుషోత్తము, ఎం. ఏ.

### ౭౦ విధవల కేశఖండనము

విధవలకు కేశఖండనము చేయవలెనని వేదములలో నెచ్చటనులేదు. ఋషిప్రణీతములగు ధర్మశాస్త్రములలో గూడ నెచ్చటను నీవిధిలేదు. వితంతువులకు కేశములులేకుండుట వారి బ్రహ్మచర్యాది నియమములకనుకూలముగ నుండునను భావముతో కొన్నిదేశములలో కొన్నివర్ణములలో కొన్ని తెగలవారు భావించి యీ కేశఖండనము నాచరణములోనికి తె

చ్చిరి. దుర్వ్యాప్తిలోనుండు కొందఱు సాహసవతులగు వితంతువులు సహజముగ నీ కట్టుబాటునుదాటి కేశములుంచుకొనుచుండిరి. దీనినిబట్టి యీ తెగలలో కేశములుగల వితంతువులందరును చెడ్డవారేయను భావమేర్పడి శిష్టులు వారిని దూరముగనుంచుచువచ్చిరి. కావున నా తెగలలో క్రమముగ వితంతుకేశఖండనము మఱింత యనుల్లంఘనీయమగు నియమముగ నేర్పడినది. దుర్వ్యాప్తిలోనుండు వితంతువులుగూడ తమపై లోకమునకు సందేహము గలుగకుండుటకై యితర వితంతువులవలెనే కేశఖండనము చేయించుకొనజొచ్చిరి. ఇట్లు కేశరాహిత్యము వితంతువుల సద్వృత్తికి సాధకముగను సూచకముగను గూడ నాయా తెగలలో భావింపబడ జొచ్చెను. అంత నా తెగలలోని పెద్దలు నిబంధనగ్రంథములలో వితంతుకేశఖండనము నొక నియమముగ చేసి దానికి ధర్మశాస్త్రవాఙ్మయములో స్థానముగల్పించిరి.

—జటావల్లభుల పురుషోత్తము, ఎం. ఏ.

## ౭౩. బాలవితంతువివాహములు

భగవంతున కేది యిష్టమో యేది యనిష్టమో చెప్పెదనని పూనుకొనుట మానవునకు తగనిపని. భగవంతుని వాక్కుగ చిరకాలమునుండి నమ్మబడుచున్న వేదమునుగూడ మానవప్రణీతమేయని బుద్ధిమంతులు నమ్ముచున్న యీదినములలో నది మఱింత తగనిపని యగుచున్నది. ఇక మన యుక్తి కనుగుణముగనున్నది భగవంతునికి సమ్మతమైనదనియు నట్లు లేని దాతని కసమ్మతమయినదనియు చెప్పరాదాయన యుక్తికి యత్తలేదు. వాదికేకాని వాదమునకు దౌర్బల్యము లేదుకదా! అందును నభిప్రాయభేదములకు విశేషమగు నవకాశముగల బాలవితంతువివాహమువంటి విషయములందు నాయుక్తి యెన్నిపోకడలనైనను పోగలదు. కౌన యుక్తినిబట్టియైనను బాలవితంతు వివాహము భగవంతున కిష్టమోయనిష్టమో నిర్ణయించుట యసంభవము. ఏవ్యక్తియైనను నట్టి నిర్ణయముచేసికొనుచో నది యాతని స్వీయవిషయములందు కర్తవ్యాకర్తవ్యనిర్ణయమున కుపకరించునేకాని యది యితరుల నెంతమాత్రము బంధింపదు. ఇక బాలవితంతువివాహములు భగవంతున కనిష్టములేయను పక్షమున నట్లు వివాహమాడిన బాలికలకు భగవంతు డేల సంతానమునిచ్చుచున్నాడను ప్రశ్నను విచారింతము. వ్యభిచారమువలన గూడ గర్భధారణమును, సుఖప్రసవమును గల్గుట కవకాశమును గల్పించిన భగవంతు డిట్టి యవకాశమును పునర్వివాహిత వితంతువుల విషయమునగూడ గల్పించుటయందు వింతయేమున్నది? భగవంతునకేవో కొన్ని యనిష్టచేష్టలుగలవనియు నందు బాలవితంతు పునర్వివాహ మొకటియనియు నంగీకరించినపుడు వ్యభిచారముకూడ నిట్టిదేయని యంగీకరింపక తప్పదు కదా! కావున నీ ప్రశ్న కేవలము బాలవితంతువులకు సంబంధించినది మాత్రమేకాక 'లోకమునందు భగవంతున కిష్టముకాని పనికి ఫలమెందులకు గల్గుచున్నది?' అను తత్త్వశాస్త్రసంబంధమగు ప్రశ్నకు దారితీయునదై యున్నది. ఇతరులను మోసగించి బాగుపడినవారి ననేకులను జూచుచున్నాము కదా! భగవంతు డట్టికర్మ కిట్టిఫలము నెందులకీయవలెనను ప్రశ్న మనకు తట్టుట సహజమే కాని 'గహనా కర్మణోగతిః' అను నంశమును మనము జ్ఞప్తియందుంచుకొనవలెను. ఏకర్మకు ఫల మెప్పు డేరీతిగ వచ్చునో మనకు తెలియదు. కర్మఫలమనుభవించుట కుత్తరలోకములేకాక యుత్తరజన్మలుగూడ గలవని నమ్ము మన మొక కర్మకు వెంటనే ఫలము రాలేదేయను తొందరను పొంద నక్కరలేదు.

—జటావల్లభుల పురుషోత్తము, ఎం. ఏ.

## ౭౪. కేరమ్సు ఆటనియమావళి

కేరమ్సు ఆటనుగూర్చియు, అందలి నియమములను గూర్చియు సమగ్రముగ బోధించు గ్రంథములు ఆంగ్లభాషయందు కలవు. అవి సాధారణముగా ప్రతి పెద్దఆటసామగ్రులమ్ము స్థలములందును (స్పోర్టింగు స్టోర్సు) దొరకును. అవి 'కేరమ్సురూల్సు' అనుపేరుతో వెలయును. అట్టిగ్రంథముఖరీదు నాల్గు అణాలకు మించదు. —ఆడిదము వేంకటరామారావు.

ఆంధ్రుల కొక నూతనానందం కలుగబోతోంది! ఎదురు చూడండి!

బెజవాడ 'సరస్వతీటాకీస్' వారి బ్రహ్మాండమగు తెలుగుటాకీ

# ద్రౌపదీవస్త్రాపహారణము

ఫిబ్రవరి నెల 17-వ తేదీన ఆంధ్రదేశమునందన్ని నగరములలోను విడుదలచేయబడును.

సూపర్వైజింగ్ డైరెక్టరు:

**హెచ్. యం. రెడ్డి**

డైరెక్టరు:

**హెచ్. వి. బాబు**



ముఖ్యపాత్రధారులు:

యడవల్లి — దొమ్మేటి

కన్నాంబ — సి. యస్. ఆర్.

గగ్గయ్య — రామతిలకం

చొప్పల్లి — నగరాజరావు

నగరాజకుమారి

ఈ చిత్ర మింతవరకు తెలుగులో తయారుచేయబడిన టాకీలకు తలమానికమై అలరించినదని ఆంధ్రభూమి అభినందించుట నిశ్చయము.

*For Booking Apyly to:—*

**ASWATI TALKIES, Ltd.,**

'Grams: "SARASWATI," KOLHAPUR.
Camp: Palace Theatre Buildings,
KOLHAPUR.

# చీటీ చిక్కింది

రచయిత:

దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డి

ఈమధ్య రంగారావు ప్రేమతత్వం కనుక్కోవాలని 'సెక్సు' పుస్తకాలు అంతులేకుండా కొని చదువుతున్నాడు. ఏశాస్త్రానికైనా అనుభవజ్ఞానము లేనిది, 'డిగ్రీ'పొంది ప్రయోజనములేదుగదా! పాపము? ఈకల్లెట్లుపడ్డ వాడు కాడు. కాన, పాపభీతిచేతనో, పదిమందిలో నగుబాట్లనో కాలము గడుపుచున్నాడు.

ఒకనాడు కాగినపాలు చల్లారినట్లు కాచే రాదువెన్నెట్లో పండుకొన్నాడు. నిద్రబోవుటకు ఎంత ప్రయత్నించినా కూర్కుపట్టలే.

ఇతని పతనానికి ఊరేగింపు జరుగుతుందన్నట్లు గాడిదెలు శంఖములు పూరించుచు పాగెత్తుచున్నవి. అపుడపుడు మూకను సర్దుత్తినదార్లర కఱ్ఱదెబ్బలవలె 'పెళీపెళీ'మని శబ్దమగుచున్నది. ఈ కూతలు, ఈ తన్నులు, మంచముమీద సాముచేయు రావుకు సంపూర్ణముగా నిద్రాభంగము కలిగించినవి. 'ఏమి శ్రీపాడు' అని ఒళ్లు విరుచుకుంటూ లేచాడు. కండువా పైనవేసుకొని చెప్పులులేకుండానే బయలుదేరాడు. నిద్రబట్టనివారు షికారు చేస్తే, కునికిపాట్లకు సిద్ధమవుతారుగదా? అంచుట్లో పండువెన్నెలాయె.

ఆయన ఒకరింటికిగాని, ఒక తోటకుగాని మరెచ్చటికిగాని పోలేదు. బజార్లలో తిరుగుచున్నాడు. ఇంతలో, ఊరికాపర్లు వీధి మలుపుల్లో ఈలవేశారు. ఏడుద్దేశములేని రంగారావు ఖంగారుపడి, వీధితడిక తీసియున్న ఒక యింటి పంచలోకి వేగంగా పోయినాడు.

ఆ ఇంటామె తలుపు తెరిచి!

'ఏమింతాలస్యము? తీరికదొరకలేదా? లోపలికి దయచేయండి' అంటూ తనప్రేమను చూపుతూ, రావుభుజానికి తనభుజము ఆనిస్తూ లోపలికి కొనిపోయింది. పై కెగిరిపోతున్న ప్రాణాన్ని బిగబట్టుకొని, బాహుపంజరమున పిట్టయి పోయినాడు. దీపము వెలుతురున బోగము కామి రావునుచూచి, తెల్లబోయి దూరముగా పోయింది. కాని, తెప్పరిల్లి చిరునగవుతో: 'రంగారావు బాబుగారు వేళగాని వేళ దయచేసారే' అంటూ సమీపించి 'కుర్చీమీద కూర్చోండి' అని చేయిపట్టుకొన్నది. రంగారావు కుర్చీమీద కూర్చుంటూ 'ఏమీలేదు. ఊరికాపర్లు సరిగా గస్తు తిరుగుచున్నారో, లేదో, కనుక్కొందామని వచ్చాను. ఇంతలో వాళ్లు సమీపించారు. నేను వాళ్ళను పరీక్షిస్తున్నట్లు తెలియకూడదని మీపంచలోకి వచ్చాను' అన్నాడు కంపంతో. 'మీరు గూడ కావలివాండ్లను చూస్తే భయమా ఏం?' అంటూ సోళనగా నవ్వింది.

'నేను చెప్పలే' అని గాంభీర్యం ప్రకటించేడు. పక్కసవరిస్తున్న కామి 'ఎందుకొచ్చిన మాటలులెండి' అంటూ సమీపించి రావు మోము తేరిపారజూచింది.

'నామాటమీద విశ్వాసములేదూ' అంటూ కండువాసవరించి లేచుటకు ప్రయత్నిస్తున్నాడు. 'ఎంతమాట : ఎంతమాట ! సరసానికన్నాను లెండి.' అని సమీపించి నిలబడినవాణ్ణి మంచంప్రక్కన కుర్చీమీద ఉన్న తమలపాకుల పళ్ళేముతీసి కూర్చోబెట్టింది. పాపము ! ఆతనికి ఏమిచేయుటకు, ఏమి మాట్లాడుటకు తోచలేదు. ఇంతలో మంచము ఆనుకొని, దిండుమీద చెయ్యిమోపి వయ్యారంగా చూస్తున్నకామి, రావు చెంపమీద ముద్దు లెంపకాయవేసి 'నేనందగత్తెనేనా !' అంటూ రావు షర్టుజేబులో చెయ్యివేసింది.

'ఏమి జేబు తడువుచున్నావు' అంటూ తన జేబుమీద చెయ్యివేసి, అసహ్యముతో 'డబ్బు లేదులే' అన్నాడు.

'మీడబ్బుకోసముకాదు లేండి' అంటూ కోపముతో చెయ్యి లాక్కొని, 'మా దొడ్డి ఆక్రమణకు యెంతపన్ను కట్టాలో చూద్దాము' అని అంటూ, తీసినచీటి ప్రక్కగా ఉంచుకొని చదువుచున్నది.

'ఆక్రమణలో కరణం-తడికెలుతీయ లేదు- అని వ్రాస్తే, నేను- సర్ది పెట్టుకొంటామన్నారు. కాన, తక్కువపన్ను వేయమని శిఫార్సువ్రాశా' అని చూపులలో గొప్పతనం చూపాడు.

'కాపుగారికి మామీద యెంతదయ' అంటూరావుక్రాపుసవరించుచూ, ముసిముసి నవ్వుతో 'మీకూపాండిత్య మబ్బిందె' అన్నది.

'ఏమిటి, నేను శిఫార్సుచేసింది అబద్ధమని కరణముచెప్పాడా ?' అని ఈర్ష్యగా చూస్తూ .....

కామి నవ్వుతూ 'అదికాదండి, ఈచీటీ చిత్తగించండి. సానులు పనికిరారని అత్తింటి కోడళ్ళను పట్టారే? ఉండండి, పుట్టింటికెళ్ళిన దొరసానిగార్ని రానివ్వండి' అని అసూయగా చూస్తూ బెదిరించింది.

రావు గాబరాగా 'నేనొకమాట చెబతా విను. నామంచిసెబ్బర్లు నీకు కొత్తగాదు. నాకు సిగిరెట్లుకాల్చే దురభ్యాసము కలదు. సిగిరెట్టుపెట్టె, అగ్గిపెట్టె, చేతిగుడ్డ వగైరాలు, జేబులో పెడితే ఒకతట్టు ఎత్తుగాఉంటుందని.'

కామి నవ్వుతూ 'అర్ధనారీశ్వరుడివలెనా?' అంది. రావు 'ఏమన్నాఅనుకో : అగ్గిపుల్లలు, గీచే అట్టముక్క, ఒక కాగితములో వేరువేరుగా చుట్టిపెట్టుకొనే అలవాటు. ఒకనాడు దారినవస్తూ, సిగిరెట్టుకాల్చుకొనుటకు కాగితము విప్పితే, అట్టలేకపోయింది. ఇంతలో దారివెంబడి నలగతొక్కిన విప్పెట్టె పడివుండింది దాన్ని తీసికొని సిగిరెట్టు కాల్చుకొని, అట్టకొఱకు చింపితె దానిలో ఈచీటి ఉన్నది. అక్షరాలనుబట్టికాని, జాబునుబట్టికాని ఎవరు ఎవరికివ్రాసిందో తెలియకపోతే జేబులోవేసి ఉన్నాను.' అని నిష్కపటంగా నవ్వాడు.

'ఇంను కేనండి, మీకూ పాండిత్యమబ్బిందని నేనన్నది' అంటూ వచ్చి కుర్చీచేతిమీద కూర్చొని 'ఆపెట్టెక్కడ చిక్కిందో ? నేను చెప్పేదా?' అంటూ కుర్చీ చేతిమీదనుంచి లేచి, ఎదుటికొచ్చి, రెండుచెక్కిళ్ళమీద రెండు చేతులువేసి, చూపుల్లోచూపులు కలిపింది

'దారిప్రక్కన అని నేను చెప్పలే?' అని తల ప్రక్కకు త్రిప్పాడు.

'అదికాదండి ఎవరింటివద్ద' అని ఒయ్యారంగా చూచింది.

'మంచినీళ్ళభావి ప్రక్కన. ఎవరైతే మనకేమి? ఈజాబు వ్రాసిన ఆమెకు పుట్టుకతో కవితావేశముకలదు. కాని, ఏమూడవతరగతిలోనో బడికి స్వస్తిచెప్పింది ఏదిచీటి?' అం

టూ చెయిచాపినాడు.

'ఆమెపేరు తెలియంది మీకివన్ని యెట్లు తెలుసు' అని జయసూచకంగా నవ్వింది.

'నవ్వి ప్రయోజనములేదు. జాబుచూడు :

'మీ అత్తసంగతి తెలుసుకద'

'కంఠోపాఠము చేసినట్లున్నారే' అనినవ్వుతూ, చీటీ చూస్తూ. 'పూర్తి చెయ్యండి' అన్నది.

'—ఇపనిచేయించటం దరముకదు. నామీద దయఉంచవలసింది.—అని చీటీలో ఉన్నది కదూ ? ఇప్పుడు బోధపడిందా ?'

'ఆ, ఆ. ఇందాకనే బోధపడింది.' అని నవ్వుతూ తలఆడించింది.

'ఏం, తెలిసింది?' అని విసుగుతో అన్నాడు.

'కవిత్వం నాకు బోధపడలేదు. కాని, మా అత్త గయ్యాళి. ఆమెకు తెలిస్తే మాట వస్తుంది. మీరిట్లు అల్లరిఅయ్యేటట్లు చెప్పంపటం న్యాయమా? నామీదు దయయుంచి అల్లరికానిమార్గం ఆలోచించు' అని వ్రాసి ఉంటుంది. బోధపడ్డదా? ఒంటరిగా మంచినీళ్ళబావివద్ద మిమ్ములను సొంతముగా మాట్లాడమని' నవ్వుతూ 'పోతారా? అయినా, ఆమె కవిత్వం ఏమిటో అదీచెప్పిపొండి' అని మంచంమీద కూర్చొని వంగి చూస్తూఉన్నది.

'ఆమె అత్త యెంతపవిత్రురాలో. ఆమెవద్ద తానెట్లు ప్రవర్తించాలో తెలుపుటయేగాక, పవిత్రాపవిత్రముల నెరుగక పిచ్చిపనులు చేయవచ్చునా? కావున, నామీద సోదరీభావముంచవలసినది. అని ఉద్బోధించినట్లు నాకు కాన్పించుచున్నది.' అని అంటూ ఉండగా......

'ప్రియురాలిజాబులో పురాణసీతులు భావించకూడదు. వన్నెలు చిన్నెలు చూడాలి. కాన నేనుచెప్పిన అర్థమే బలవత్తరమైనది. ఇదేనా కవిత్వపుపస?' అని హేళనగానవ్వింది.

'ఒకరి కొకవిధముగా, మరియొకరి కొకవిధముగా, వారివారి తత్వముల ననుసరించి తోచునట్లు వ్రాయుటే, కవిత్వ పరమావధి. కాబట్టి కవితావేశము కలదనియు, అక్షరలోపమునుబట్టి మూడవతరగతి అనియు ఊహించితిని. ఈమన మనహిందూబాలికల చదువు ఆగిపోవుటచే, ఎందరో కవయిత్రులుగాకుండా పోవుటయేగాక, నీవుచెప్పిన అభిప్రాయప్రకారమే ఈచీటి వ్రాసియుండిన, వారి అక్షరజ్ఞానము యెట్లు దుర్వినియోగము చేయుచున్నారో ఊహించు......' అంటూ మొఖమున చెమటబిందువులు చేతిరుమాలతో తుడుచుకొన్నాడు.

'ఊహించడాని కేముంది ? పరాయివానికి జాబువ్రాయడమే ఆధారం. మీరుచెప్పినట్లు తనకిష్టములేకపోయిన జాబువ్రాయవలసిన అంతపనియేమి వచ్చింది. మీరే ఊహించండి' అంటూ నవ్వింది.

'కవిత్వంలో ప్రస్తుతార్థముగాక కథాసంబంధములేని మరియొక భావముతోచిన దానినే 'ధ్వని' అంటారు. 'నాచీటీ నాకివ్వు. పోవాలె' అని చెయిచాపినాడు.

'ఓడినా పైచెయ్యి నాదేనన్నారు. కనుకనే మీకూ పాండిత్య మబ్బిందని, ఇందాకనే చెప్పాను' అంటూ తనఅర్థమును రావు అంగీకరించాడని పకాపక విరుగబడి నవ్వింది.

'పోయివస్తాను'అని లేచి 'చీటిఇవ్వు'అని చెయిచాపినాడు.

'మరల దర్శనమెపుడు' అని కండువాపట్టుకొన్నది.

'ఎప్పుడో చెప్పలేను' అంటూ కండువా

సవరించుచూ 'చీటియివ్వు' అన్నాడు.

'చెప్పంది పోనివ్వను' అని యెదురువచ్చి నిలబడినది.

'ఏదో తారీఖున వస్తాను. చీటీయివ్వు పోవాలె' అని చేయిపట్టుకొన్నాడు.

'29, 30, 31 అబ్బ! 1, 2, 3, 4... ఎన్నినాళ్లు 9, 10' అని దీనంగా చూస్తూ రొమ్ముమీద తలఆనించింది.

'ఎవరన్నా చూస్తారు...... నేను ఊళ్లో ఉండను. చీటీయివ్వు' అని చెయి చాపాడు.

'ప్రియురాలిని వెతుకుతారు కాబోలు' అని ఈర్ష్యగా నవ్వింది.

'నిజముచెబితే నమ్మవు. నేనేమి చేయాలి? నిద్రవస్తూంది పోవాలె. చీటి...'

'ఈమంచంమీద నిద్రపోండి' అని చెయిపట్టి లాగింది.

'వద్దు, వద్దు, ఇంటికిపోవాలె. చీటి...'

'ఎప్పుడొస్తారు?' అని ఆమె రావుచొక్కాగుండీ తిప్పుచు అన్నది.

'ఇంతకుముందు చెప్పలె!' అని తొలిగి పోబోయినాడు.

'మీరు మళ్ళీవచ్చినప్పుడు ఈచీటీ ఇస్తాను.' అంటూ పోయి మంచముమీద కూర్చున్నది. రావు వెనుతిరిగి మంచముదగ్గరకువచ్చి మెల్లగా 'పంచలోకి ఎవరో వచ్చిపోతున్నట్లు చప్పుడు అయింది' అన్నాడు.

'ఊరికావలివాళ్లు అప్పుడపుడు వచ్చిపోతుంటారు. నేను చూచివస్తాను. ఉండండి' అని రంగారావును నిలిపి, గడియతీసి వీధిలోకి పోయివచ్చి, 'ఎవరులేరు, ఊరికనే భ్రమపడ్డాము' అని తెచ్చుకోలు నవ్వునవ్వింది.

రంగారావుకు ఇద్దరు గుసగుసలాడిన శబ్దం వినబడ్డది. కాని 'ఎవరులేరు' అని నవ్వుతుం దేమని ఆలోచిస్తూ, చుట్టుప్రక్కల చూచి, రావు పిల్లివలె బయటపడ్డాడు.

## చిత్రము

చిత్రములకెల్ల చిత్ర మో శేషశయన!
తావకపదాబ్జములు నిరతమ్ము నాదు
హృదయకమలాకరమున నహీనకాంతి
పుంజముల వెదజల్లునే సంజలేక;
ఎప్పుడో మున్ను సురలెల్ల ముప్పుదప్పి
నమృతముం ద్రావి సంతృప్తినందిరంట
యెల్లవేళల నిపుడు నాహృదయపాత్ర
నీదు నామామృతమ్ముచే నింపి త్రావు
చుండియును నేను సంతృప్తినొందలేదు;
పల్లవింపక నైరాశ్యవహ్నిలోన
వాడి రూపరిపోయిన భావలతలు
తావకారుణపదవసంతమ్ము సోక
చివురులందొడ్డి విరులపుష్పించదొడగె;
చిరుతప్రాయాన నాప్రేమ జీవలతకు
కరకు తెవులొండు ప్రాపించె, గాని నేడు
వయసుముదిరినకొలది నాపంచప్రాణ
ములు తెవుళ్ళకు తెవులయ్యె; భూతనాథ!

* * *

ఓపరాత్పర! నీవు నీయున్న రూపు
దాచి మాబోంట్ల నేల చింతాసముద్ర
మందు ద్రోచెదు; సాధించి డెందములనె
చూడజాలమొ నిన్ను మాచూపులలర.

—ములుమూడి ఆదిశేషాద్రి రెడ్డి.




## జంతువులయొక్క తెలివి.

డాక్టర్ డేవిడ్ కాట్జు అను జర్మను ప్రొఫెసరు ఈమధ్య లండను నగరములో తా నొసంగిన ఒక ఉపన్యాసములో జంతువుల యొక్క అసాధారణ మైన తెలివిని ప్రకటించు అనేక విషయములను తెలిపిరి. చాలమైళ్లు దూరములో నుండగనే సీతాకోకచిలుకలు ఒకదాని నొకటి పసిపట్టగలవని చెప్పిరి. తేనెటీగలు తమ పనులను చేసికొనుటలో కాలనియమమునకు కచ్చితముగా బద్ధములై యుండు వనియు, గడియారమును చూచి వేళను నిర్ణయించినట్లు వాని చర్యలబట్టి వేళను తెలిసికోవచ్చు ననియు కాట్జుగారు చెప్పిరి. మార్గమును కనిపెట్టుటలో జంతువులకుగల నేర్పును సూచించుటకు వారు కొన్ని అద్భుతములైన దృష్టాంతములను పేర్కొనిరి. జర్మనీదేశములోని వివిధ ప్రాంతములందు వానకోయిలలను వందలకొలదిగ పట్టుకొని మూసివేయబడిన పంజరములందు వానిని బర్లిను నగరమునకు తీసికొని వెళ్ళి వదలిపెట్టగా అవియన్నియు సరిగా తమతమ గూండ్లకు చివాలున ఎగిరిపోయినవట. మ్యూనిచ్ పట్టణమందు మరియొక అద్భుతవిషయము జరిగినది. ఒక శునకమును ఒక కొయ్యపెట్టెయందు పెట్టి అది ఉన్నప్రదేశమునకు నాల్గుమయిళ్ళ దూరమునకు తీసికొనివెళ్ళి విడిచిరి. అది ౨ గంటలలో తన యింటికి వచ్చిచేరినది. త్రోవయందు దానిచర్యను శాస్త్రజ్ఞులు పరిశీలించుచుండిరి. అది చూచూచి మార్గమును తెలిసికొనలేదు. త్రోవతప్పిపోవుట తటస్థపడలేదు. అతి సహజముగా అది తన గృహమునకు వచ్చినది. ఇంతకు పూర్వ మది యెన్నడును తన గృహ పరిసరములను దాటి వెళ్ళినదిగాదు. మరల వెనుకటి విధముననే తీసికొని వెళ్ళి విడువగా అది వేఱొక మార్గమున ఒకటిన్నరగంటలోనే యింటికి చేరెను. ఇది మఱింత చిత్రముగానున్నది. శునకములయొక్క యీ సహజజ్ఞానరహస్యము దురవగాహముగా నున్నది. మఱియొక వైజ్ఞానికుడు తేనెటీగలను నిర్ణీతకాలములందు వచ్చి ఆహారమును తీసికొనునట్లు చేయవచ్చునని ఋజువు పరిచియున్నాడు.'

—ధర్మసాధని.

* * *

## ఇటలీ : ఇండియా

ఇటలీదేశము అయిరోపాఖండమునకు దక్షిణభాగమునందున్నది. అది మధ్యధరాసముద్రములోనికి చొచ్చుకొనిపోవు ఒక సన్నని పొడుగైన భూకల్పము. మనహిందూదేశము హిందూమహాసముద్రములోనికి అట్లే చొచ్చుకొనియున్న భూకల్పమని మనకు తెలియును. అయితే మనదేశ మాదేశముకంటె చాలా యెక్కువ వెడల్పు యెక్కువ పొడవు. మనదేశములాగే ఆదేశములందుకూడ కొండ లెక్కువగా చెదరి వ్యాపించియున్నవి కాని దీర్ఘనదులు కాని సారవంతములగు భూములు కాని అక్కడ తక్కువ. మనదేశమునకు ఉత్తరమున హిమాలయపర్వతములు వ్యాపించి మనలను తక్కిన ఆసియాఖండవాసులనుండి వేఱుచేయుచున్నట్లే ఆదేశమునకుత్తరమున ఆలప్సు అను పర్వతములు వ్యాపించి ఆదేశమును తక్కిన అయిరోపా ఖండమునుండి విడదీయుచున్నవి. ఇవి మనదేశమునకును ఆదేశమునకును గల భౌతికపు పోలికలు. చారిత్రకముగ రెండును ప్రసిద్ధదేశములు. క్రీస్తు పుట్టుటకుముందు మూడునాలుగు వందల సంవత్సరములు మొదలు అతని మరణమునకు వెనుక నాలుగైదు శతాబ్దములవరకును రోమక సామ్రాజ్యము వర్ధిల్లెను. రోము ఇటలీకి ప్రధాననగరము. రోమనులు అయిరోపాఖండమునెల్ల జయించి మంచి ప్రభుత్వములను నెలకొల్పిరి. అనాగరక ప్రాంతములందు వారి నాగరకత, రోడ్డులు, విద్యావిధానము, సైనికశిక్షణము మొదలగునవి జొనిపిరి. కాని హద్దుమీరిన

పన్నులను లాభములను బహుమానములను సంపదలను ఆదేశస్థులనుండి కొల్లగొని వారిని హింసించుచుండిరి. ఈదోపిడులవల్ల ఆదేశస్థులా పేదలైరి. వీరికంటె బలవంతులగుగాతులు అను ఆటవికజనులు వీరినిరువురను చితుకగొట్టి యీసామ్రాజ్యమునెల్ల ధ్వంసమొనర్చిరి. చారిత్రకముగ మనదేశమునగూడ నెన్నో సామ్రాజ్యములు నగరములు గ్రామములు గ్రంథములు విజ్ఞానములు లేచి ప్రసిద్ధిపొందినవి. ఇప్పుడు మన మాంగ్ల సామ్రాజ్యమున నున్నాము. ఇటాలియనులు స్వతంత్రులు.

—గరిమెళ్ళ సత్యనారాయణ, బి. ఏ.

* * *

## పొగాకు కనుగొనబడిన క్రొత్తలో

జహంగీరు చేసిన రాజప్రకటనలందును, అతని దినచర్యా గ్రంథములందును పొగాకునుగూర్చిన ప్రసక్తినిబట్టి హిందూదేశమునకు జహంగీరు రాజ్యపరిపాలనాకాలమునగాని అతనికి పూర్వము పరిపాలించిన ఢిల్లీపాదుషాయగు అక్బరు పరిపాలనాకాలమునగాని పొగాకు వచ్చియుండవచ్చునని తెల్పుటకు చరిత్రాధారములు గలవు. 1520-వ సంవత్సరమున హమ్‌బోల్టు అనునతడు తన దినచర్యా గ్రంథమున యూకటాన్ నందలి మెక్సికన్ రాష్ట్రమున మొట్టమొదట యీపొగాకు కనుగొనబడినదని వ్రాసెను. అప్పుడది పెటమ్ అను పేరుతో వ్యవహరింపబడుచుండెనట. అచ్చటినుండి అది వెస్టు ఇండీసునకు ఉత్తర అమెరికాకును కొనిపోబడెను. 16-వ శతాబ్దారంభమున ఫ్లోరిడానుండి పోర్చుగల్‌నకు వచ్చిన హెర్ నాన్‌డజ్ డి టొలెడో అనునతడు యూరపుఖండమునకీ పొగాకును గొనివచ్చెను. ఫ్రాన్సిస్ అనువాని యేజంటైన 'జీన్‌నికట్' అనువానిచే పొగాకు విత్తనములు పోర్చుగల్‌నుండి 'కేథరైన్‌డి మెడిసిస్' అనునామెకు పంపబడెను. జీన్‌నికట్ పేరునుబట్టియే యీ (పొగాకు) మొక్కకు మొదటిపేరు పెట్టబడెను. 1586 సంవత్సరము రాల్ఫులేన్ అనువానిచే పొగాకు యింగ్లండున ప్రవేశపెట్టఁబడెను. 'వర్జినియా'కు వలసపోయిన వారితో కలసివచ్చిన సర్ ఫ్రాన్సిస్ డ్రేక్‌ను అతని యనుచరులు మొట్టమొదట చుట్టకాల్చు టొకనాగరకతాచిహ్నముగ నెంచి కాల్చుట కారంభించిరి. ఆయలనాటు క్రమముగా 16-వ శతాబ్దాంతము నాటికి ప్రజలయందు నాటుకొని చుట్టకాల్చు టొకయాచారముక్రింద పరిణమించినది. క్రమముగా చుట్టకాల్చుట యూరపు, టర్కీ, ఈజిప్టు, హిందూదేశము, చీనాదేశములకు వ్యాప్తినందినది. కాని కొన్ని దేశములందు అందలి క్రైస్తవమత మవలంబించిన రాజులును, మహమ్మదీయులైన రాజులును తమరాష్ట్రములందు చుట్టకాల్చు వారలకు కఠినమైన శిక్షలు విధించియు కఠినశాసనముల నమలునందుంచియు పొగాకును నిషేధించుటకు యత్నములు జేసిరి. మొదటి జేమ్సు అను ఆంగ్లరాజు 'పొగాకుపై దాడి వెడలిన రాజు' అను పేరుపొందెను. 1624-వ సంవత్సరమున 8-వ పోప్ అర్బన్ అను మతాచార్యుడు చర్చిలందు ముక్కుపొడుము పీల్చువారలనందఱను మతమునుండి బహిష్కరించుటకు శాసనముల నమలునందుంచెను. పది వత్సరములు గడచిన తరువాత రష్యాయందు చుట్టత్రాగుట నిషేధింపఁబడెను. చుట్టత్రాగుచున్నట్లు కనుగొనఁబడినవారల ముక్కులుకోసి వేయబడునట్లు కఠినశాసనము అమలునందు పెట్టబడెను. 1653 సంవత్సరమున కేంటన్ కౌన్సిలువారిచే చుట్టకాల్చుచున్నట్లు కనుగొనఁబడినవారు నేరస్థులుగాఁ జేర్కొనఁబడి, కఠినముగ శిక్షింపఁబడుచుండెడివారు. బెర్నన్ నగరమున 1661-వ సంవత్సరమున చేయబడిన పోలీసునిబంధనలందు గల పదింటియందు వ్యభిచారదోషమున కివ్వబడు శిక్షాసంబంధ నిబంధనమునకు దిగువ చుట్టకాల్చు వారల కివ్వవలసిన శిక్షానిబంధనముగలదు. 1719-వ సంవత్సరమున స్ట్రాస్ బర్గు సెనేటువారు తమ దేశమున పొగాకుపంట వేయరాదని శాసించిరి.

—ఆకుండి వెంకటశాస్త్రి.

# తెగిన లింకు

రచయిత:

చెలికాని శ్రీరామారావు

వసంతకాలపు పొద్దు. ప్రకాశమానంగా వున్న సూర్యకిరణాలు నే చదువుకునే గదిలోకి వొచ్చిపడుతున్నాయి. నేను రాసుకునేబల్లకి దగ్గరేవున్న అద్దంమీద కిరణాలు పడుతున్నాయి. అంతేకాదు కిటికీలో వ్రేలాడుతూన్న పికిలిపిట్ట పంజరంమీదకూడా కిరణాలు పడుతున్నాయి. ఆనందంపట్టలేక పికిలిపిట్ట శ్రావ్యంగా పలుకుతూంది. దాని పలుకులు నా ఆలోచనకి భంగం కలిగించాయి.

నేను రాస్తున్నాను కాని, ఆపికిలిపిట్ట పలుకులవల్ల రాతసాగలేదు. అకస్మాత్తుగా చప్పుడయింది, రెక్కల రెపరెపలు వినిపించాయి, పలుకులు ఆడిపోయేయి. నేనులేచి తొందరగా కిటికిటీ దగ్గరకి వెళ్ళాను. పంజరం క్రిందపడి వుంది. గింజలు చెల్లాచెదరై పోయేయి, నీళ్లు ఒలికిపోయి గిన్నెబోర్ల పడివుంది, తివాసీ తడిసి గత్తరై పోయివుంది. పిట్ట భయపడి సొమ్మసిల్లింది. పంజరానికి తగిలించినగొలుసు తెగిపోయింది. ఒక్కలింకే తెగిపోయింది. అంతే! కాని, ఈ జరిగిన గత్తరకి అదొకటీ చాలు. నేను ఆపంజరంతీసి గింజలన్నీ వూడ్చి పోగు చేశాను. అప్పుడు ఆ తెగిపోయిన గొలుసుతీసి లెక్కపెట్టడం మొదలెట్టా: ౨౦,౩౦,౪౦,౫౦, ౧౫౧ ఆదిగా. అన్నీ దిట్టంగానే వున్నాయి. కాని, వాటిలో వొకటి- నిజంగా వొక్కటే- ఈఅల్లరికి కారణం. ఏమి టీవిచిత్రం? గొలుసు బలంఅంతా ఆ వొక్కలింకుమీదే ఆధారపడి వుందా! తక్కిన ౧౫౧ ఎంతదిట్టంగా వుంటే మాత్రం, ఏం ప్రయోజనం? ఒక్కలింకు విరిగిపోతే గొలుసుఅంతా విరిగిపోయినట్టేకదా! తక్కిన ౧౫౧ లింకులూ విడిపోయినట్టేకదా! ఈ దృశ్యంఅంతా కనపర్చాను. భగవంతుడేం చెబుతూన్నదీ రాస్తాను.

ఎవ్వడైతే ధర్మంఅంతా ఆచరిస్తూ ఒక్కరవ్వంత వ్యతిరేకంగాచేస్తేచాలు వారు పూర్వపుధర్మంఅంతా ఆచరించనట్టే లెక్క. నువ్వు కొంచమైనా వ్యతిరేకంగా నడవకండా ధర్మంతో ఆచరిస్తున్నావా? ఒక్కసంగతి జ్ఞాపకం పెట్టుకో. భగవంతుని గొలుసులో వొక్కలింకు తెగినా చాలు గొలుసుఅంతా తెగిపోయినట్టే.

('మార్గదర్శిని' నుండి.)

# ఇన్స్యూరెన్సు విషయములు

## మానవుడు : జీవిత భీమా

ప్రపంచమునందలి మానవసంబంధములగు కోరికలలో రక్షణనుగూర్చిన కోరిక బృహత్తరమైనది, మహత్తరమైనది. సృష్ట్యాది నుండియు స్త్రీపురుషులు రక్షణకొరకు విశేష ప్రయత్నములను గావించుచును, విశేషముగ పరిశ్రమించుచును ఉన్నారు. ఈ ప్రయత్నములు, ఈ పరిశ్రమ నేటికి అనగా వర్తమాన కాలమునకు సరిపడు ఆహారపదార్థములు, వస్త్రములు, తలదాచుకొనుటకు అనువగు తావు సంపాదించుకొనుటకేగాదు. రేపటికి అనగా భావికాలమునకుగూడ సరిపడు ఆహార పదార్థములు, వస్త్రములు, తలదాచుకొనుటకు అనువగుతావు కూర్చుకొనుటకును ఈప్రయత్నములును, ఈ పరిశ్రమలును అయిఉన్నవి.

భావిరక్షణకు వలయు యత్నము, పరిశ్రమ కావించుట సహజవివేకము. రేపు రాగల శీత కాలమున రక్షణకలుగుటకై ఉడుత నేడు గింజలను కూడబెట్టుచున్నది. తాను ఆహారము సంపాదించుకొనుటకు అసమర్థమగు కాలమునకు రక్షణకలుగుటకై ఎలుగుబంటి నేటినుండియు తన శరీరమున కొవ్వును పేర్చుకొనుచున్నది. తేనెటీగ భావిరక్షణమునకై తేనెను కూర్చుచున్నది. తెలివిగలచీమ భావి రక్షణమునకై ఆహారపదార్థములను కూడబెట్టుచున్నది. తన బాధ్యతలను గుర్తించిన మానవుడుగూడ తగుమైన జీవితభీమాపట్టాను కలిగియుండుట మూలముగా భావిరక్షణ విషయమున జాగ్రత్తపడగలడు.

భావికాలమునుగూర్చి మాటలాడునపుడు నేను మీయొక్క ఒక్కరి భావినిగూర్చిమాత్రమేగాక మీ కుటుంబముయొక్క భావిని గూర్చికూడ తలంచుచున్నాను. జీవితభీమా విధానమున ఒకడు ఆర్జించుటకు అతడు మరణింపవలసియుండునని కొందరి అభిప్రాయమై యున్నది. అది యొకదురభిప్రాయము. నేడు, ఆధునికజీవితభీమావిధానమున నీవు బ్రతికి యున్నను, చనిపోయిననుకూడ ఆర్జింపగలవు. విశ్రాంతిగొనుటకు పూర్వమే నీవు మరణించుచో జీవితభీమాద్వారా నీవు నీ కుటుంబమును రక్షింపగలవు. నీవు ఒకవేళ అకాలమున మరణింపకుండు అదృష్టవంతుడవే యగుచో నీవు నీవృద్ధాప్యమును కాపాడుకొనగలవు. ఎట్లన? నీ వృద్ధాప్యదినములకు జీవిత భీమా కొంత వరుమానమును ప్రసాదింపగలదు. నీవు చనిపోవుచో నీకుటుంబము పట్టాధనమును పొందును. నీవు బ్రతికియుండుచో నీవే ఆ ధనమును పొందుదువు. ఆ ధనమును నీవు ఎప్పటికిగాని నష్టపడజాలవు.

తన ఆలుబిడ్డలసుఖమునకు, శ్రేయస్సునకు తగినట్లు అమర్చి జాగ్రత్తపెట్టుట ప్రతియొక మానవునియొక్కయు ప్రథమ కర్తవ్యము. 'అతడొకభీమాపట్టానైనను కలిగియుండ లేదు' అని ఒకమృతునిగూర్చి వినుట నిజమైన విషాదాంతవిషయము. ఒకడు బ్రతికియున్నంతకాలమును ఎంతటి యుచ్చస్థితిలో తన జీవితమును నడిపియుండుగాక అతడు భావికాల

ముపై దృష్టినిలిపి తనభార్యకు, కుటుంబము
నకు కొంత కూర్చిపెట్టనిచో భర్తగా, తండ్రి
గా ఆతడు చేయవలసిన ప్రధానకృత్యమును
విస్మరించినవాడే యగుచున్నాడు.

ఏ ఇన్సూరెన్సుకంపెనీయొక్క ఫైల్సుగాని
నీవు ఒకసారి తిరుగవేయుచో జీవితభీమా
మానవాభ్యుదయమునకు ఎట్లు తోడ్పడినదో
తెలుపు నిదర్శనములు బహుళముగా నీకు కని
పించును. తోడిమానవుల హృదయపూర్వక
మగు సానుభూతిని చూఱగొను కేసులు వేల
కొలదిగ ఆఫైల్సునందు మనకు గాన నగును.
కొద్ది మొత్తమునకుమాత్రమే భీమాపట్టాను
కొనిన కేసులే అందు బహుళములైయుండును.
కాని తన కొద్దిపాటి ఆర్జనయందే ఒకడు తెలి
వితో కొంత త్యాగముచేసి కుదువపెట్టుటకు
సమ్మతించినాడు కావుననే తన మరణానంత
రము తనకుటుంబము కొత్తపరిస్థితులకు అమ
రుకొనుసంధికాలమున కలుగగలకష్టపాటును
అతిక్రమించుటకు వలయు ధనమును ఆతడు
తనకుటుంబమునకు ఈయగలుగుచున్నాడు.

మనకు నేడు విదితమైయున్న జీవితభీమా
విధానము తన పోషణవలని రక్షణను, సుఖ
మును జీవితమునందలి అన్నిశాఖలపై గూడ
ప్రసరించుచున్నది. తుది రుగ్ణతవ్యయములను,
దినవారపు ఖర్చులను జీవితభీమా భరించు
చున్నది. తనఖాలు, ఆదాయపుపన్నులు మొ
దలగు అప్పులను తట్టుకొనుటకు వలయు ధన
మును అది ఇచ్చుచున్నది. తనభర్త మరణా
నంతరము తన భరణము తాను సంపాదించు
కొనువిధానమును ఆమె నేర్చుకొనువఱకును
జీవితభీమా ఆమె సుఖజీవనమునకు హామీ
ఇచ్చుచున్నది. లేదా తన బిడ్డలను లెస్సగ
పెంచి వారికి సముచితవిధమున విద్యాబు
ద్ధులు నేర్పించుటకు వలయు అవకాశమును
కల్గించు మూలధనమును అది కల్గించుచున్న
ది. నీవు ఇహలోకమున ఉన్నను వీడినను నీ
పుత్రుడుగాని పుత్రికగాని ఉన్నత విద్యాభ్యా
సమునందుటకు వలయు ధనమును జీవితభీమా
ఒసగగలదు.

కుటుంబమునకు రక్షణకూర్చుట జీవితభీ
మా విధానమున అతిముఖ్యమైనదనుట నిస్సం
దేహమే. కాని అంతటి ముఖ్యమైనవిషయము
మఱియొకటిగూడ గలదు. అది యేమన? ప
ట్టాదారు వృద్ధాప్యమువఱకు జీవించుచో ఆత
నికి ఆకాలమున వలయు రక్షణను కూర్చుట.

ప్రతివానికిని రెండువిధములైన రాబడులు
గలవని చెప్పబడుచున్నది. ఆర్జించిన ఆతనికే
చెందగల ఆదాయము ఒకటి. తాను తప్పక కా
గల వృద్ధునకు చెందగల ఆదాయము రెండు.

యౌవనకాలమునఆర్జించినధనము వృద్ధా
ప్యమునకు దాచుకొనియుంచుటకు అనువైన
విధానమును జీవితభీమా కల్గించుచున్నది.
అనగా యువకునిధనము వృద్ధునకుగాను దా
చబడుచున్నదన్నమాట. అప్పటప్పటి జీవిత
ములనుండి ఏడాది ఏడాదికి వెనుక వేయబడిన
కొద్ది మొత్తములను విశ్రాంతిగొను వృద్ధా
ప్యకాలమునకు ఒకపెద్ద మొత్తముగా చేర్చి
యిచ్చుటకు నేటి జీవితభీమావిధానము హా
మీగా యిచ్చుచున్నది. యువకుని ఆర్జననుండి
నేటి ఖర్చులకు అత్యవసరముగా అక్కఱలేని
రాబడిని సంగ్రహించి దానిని పనికిపెట్టి పెరు
గనిచ్చి ఆ మొత్తమును వృద్ధునకు ధనము
యొక్క అక్కఱ విశేషముగనుండుకాల
మున జీవితభీమా ఇచ్చుచున్నది.

ఈ ఆర్థికమాంద్యపు దినములలో జీవిత
భీమావలన మానవులకు కలిగిన లాభములు
అనంతము.

[ఎ. ఇ. స్మిత్ అనువారి రేడియో ఉప
న్యాసము. స్పెక్టేటర్ పత్రికాప్రచురణము.]

*-The Indian Policy Holders Review.*

# ప్రశ్న

రచయిత:
శ్రీ గిర్రాజు రామారావు

ప్రభాకరుని ప్రథమకిరణములు నాగదిలో నా కండ్లయెదుట నాటలాడుకొనుచున్నపుడు నాసమీపమున మధురమందస్మితవదనముతో నన్నేల పలుకరించెదవు? నిద్దురమత్తులోగూడ జూడగల సుకుమారి నీవే కావలెనని నీవు కోరుదువా? అటు చూడుము. పవనుడెవ్వరివియోగవ్యథాభారమున నికుంజవనమున బిచ్చియెత్తినట్లు తిరుగుచున్నాడో!

ప్రాతఃకాలమున పక్షుల మధురగానము నాలించుచున్నపుడు, నా చెవులదగ్గర ప్రభాతగానమును ప్రారంభించెదవేల? నాశుష్కహృదయమున నానందప్రవాహమును ప్రవహింపజేయగలది మరియొకటిలేదనియా? అటు చూడుము. ఎవ్వరి హృదయము నానందపెట్టుటకు ఉపవనమున పకపకనవ్వుచున్నది కుసుమము?

సూర్యుడాకాశమున దన సాధారణపు త్రోవనే పోవును. అప్పుడు నీస్నేహవాత్సల్యమందలిపైకిబోవు నెందులకు? దానము, పరోపకారమును బోధింపదలంతువా? నీకిచ్చుటయే గాని పుచ్చుకొనుట యెరుగవా? చూడుము! అంధకారమునుపుచ్చుకొని యెవరిని ప్రకాశింపజేయుటకు తార మిణుకుమిణుకు లాడుచున్నది?

సూర్యుని తాపములోకలసి శీతలవాయువు ప్రవహించునప్పుడు పీడితహృదయముల చెంత జేరెదవేల? నీస్పర్శచే శాంతివహింపగలనని యా? చూడుము, చంద్రికప్రకాశించి పూలతీవనమును మత్తెక్కించినది. కోమలతరుణీమణి చంచలనయనముల నృత్యము చేయుచున్నది. నీవు నా హృదయముయొక్క హృదయములో డాగినంతవరకు నాకు శాంతిలేదు.

సాయంకాలపు నీడలు నాలుగుప్రక్కలకు బరిగెత్తునపుడు నీవును జేతులుచాచుకొని నావైపు పరిగెత్తుకొని వత్తువేల? అభయమునకాలేక శరణుకా? నీధైర్యమును జూచుకొనియే నిశాదేవిని యాహ్వానించుచున్నాను. చూడుము. పాపము విచారించుచు ప్రకృతీభవనమున నొంటరిగా తిరుగాడు నిర్ఝరి నాకు స్నేహితురాలు.

అంధకారము, నిశ్శబ్దము సర్వత్ర వ్యాపించినప్పుడు అత్యంతతత్పరతతో నాయాత్మరక్షణార్థమువలె పరిగెత్తుకొని వత్తువేల? నీనేత్రజ్యోతిలో గాఢాంధకారమును బెగల్చి చూడగలుగుచునే యున్నాను లెమ్ము. చూడుము. చపలాకుమారి రంగులకాంతులను జూచి నవ్వుచున్నది.

అర్థచంద్రుడు మేఘములచాటున నుండి తొంగిచూచునప్పుడు నాకదియేమియో చిన్నితనపు ఆటలు జ్ఞాపకము వచ్చుచున్నవి. ఈ మనుజప్రపంచోద్యానముననే వనమాలి వసించుచున్నాడు. అతనిదేగదా ఈలీలయంతయు. ఓహో! ఒక్కదినములో నాకుగావలసిన పాఠము దొరకినది. నీ స్థూలశరీరము నాకు దొరుకకపోయినను నీలోని స్థిరమైన వస్తువును నాదగ్గరనే యుంచుకొందును. నీ కొకనమస్కారము.




## ౧౨౮. ప్రజామిత్ర సంక్రాంతి సంచిక

ప్రజామిత్ర యువ సంక్రాంతి సంచికను అందుకొనుటకు చాల ఆనందితులమగుచున్నాము. ముఖచిత్రము త్రివర్ణరంజితమై మిక్కిలి ఆకర్షణీయముగ నున్నది. సంక్రాంతి సంబంధములగు పత్రికయందలి చిత్రములు సంపాదకుల ఉచితజ్ఞతకు, జాతీయదృష్టికి నిదర్శనములై యున్నవి. శ్రీయుతులు తాపీ ధర్మారావు, కపిల కాశీపతి, తుమ్మల సీతారామమూర్తి చౌదరి, బి.టి. రాఘవాచార్యులు, ఏ. వి. సీతారామయ్య, కొసరాజు రాఘవయ్య చౌదరి, గొల్లపూడి సీతారామశాస్త్రి, ఏజెళ్ళ శ్రీరాములు చౌదరి, ఏటుకూరి వెంకటనరసయ్య, దిగవల్లి వెంకట శివరావు, వేలూరి శివరామశాస్త్రి, పట్టాభి సీతారామయ్యగార్ల వ్యాసములతో సంచిక పరిపుష్టినొంది యున్నది. ఆంధ్రవారపత్రికాహారమున ప్రజామిత్ర నాయకమణి. అట్టిదాని ముప్పదిరెండుపుటల ఈ ప్రత్యేకసంచిక వెల ఒక అణామాత్రమే ఉంచి ఈ పత్రిక నిజమైన ప్రజామిత్రమైనది.

## ౧౨౯. లియో టాల్‌స్టాయి

'తనకున్న ధనంఅంతా దరిద్రులికి సాయంచెయ్యడంలోనూ, శక్తిఅంతా నిస్సహాయులైన ప్రజలకు సాయంచెయ్యడంలోనూ, జీవితంఅంతా ప్రపంచానికి మంచిమార్గం చూపడంలోనూ వినియోగపరచిన స్వార్థత్యాగి' అయిన రష్యన్ మహనీయుడు టాల్‌స్టాయి జీవితమును గానముచేయు ఉత్తమగ్రంథమిది. విశ్వసాహిత్యమాలలో తొలికుసుమము. రచనము సరళముగాఉండి విషయమును ఉత్తేజకరముగా ప్రదర్శించుచున్నది. 115 పుటలుగల ఈ పుస్తకము వెల 0—3—0 మాత్రము నిర్ణయించుట ప్రకాశకుల ప్రజాహితమున కొక నిదర్శనముగా నున్నది. ఈ గ్రంథము ఆంధ్రులలో అర్హప్రచారమునందుగాక యని కోరెదము. గ్రంథకర్త మహీధర రామమోహనరావుగారిపేర అంబాజీపేట పోస్టు ముంగండకు వ్రాసిన ప్రతులు దొరుకును.

## ౧౩౦. హిందూదేశచరిత్ర

ఆధునికాంధ్ర యువకులలో నొకరగు శ్రీనాయని సుబ్బారావు (బి.ఏ., బి. ఇ. డి.) గారు సులభమగు తెనుగు వచనమున రచియించిన 'హిందూదేశచరిత్రము'ను తుదముట్ట చదువుటకు మిక్కిలి ఆనందము పొందితిమి. జాతీయముగనున్న ఇందలి శైలి బాలురకు విషయగ్రహణమున బాగుగ తోడుపడగలదని మా అభిప్రాయము. నిదర్శనముగా ఒకపట్టు చూడుడు: '..ప్రయత్నించి దానిని గెలిచెను. కాని కొత్త నీరువచ్చి పాతనీటినిగూడ కొట్టుకొనిపోయెనన్నట్లు త్వరలోనే సమర్ఖండ్, ఫర్ఘానారాజ్యముల రెంటిని అతడు కోలుపోయెను. ప్రయత్నించి మరల రెంటిని గెలిచెను...' చక్కని పటములతో పఠనయోగ్యమైయున్న ఈ సమగ్రభారతదేశచరిత్ర విద్యాలయాధికారుల విశేషమన్ననకు పాత్రమగుగాకయని కోరెదము. క్రౌనుసైజున 357 పుటలుగల దీనివెల రెండు రూపాయిలు. వలయువారు గ్రంథకర్తపేర నరసారావుపేట వ్రాయునది.

## ౧౩౧. దేశీయగీతములు

దేశీయస్వాతంత్ర్యము, కాంగ్రెస్ ప్రతిభ, కాంగ్రెస్‌పక్షము, తద్విజయము మొదలగువానివలన గలుగు ప్రయోజనములను కీర్తించు మనోహరగీతముల

సంపుటి. కాంగ్రెస్ జూబిలీ సందర్భమున రాజమహేంద్రవరము కాంగ్రెసు స్వర్ణోత్సవసంఘమువారిచే ప్రకటింపబడినది. దేశసేవకులు, దేశభక్తులు, పత్రికారచయితలునగు శ్రీ గరిమెళ్ళ సత్యనారాయణగారు వ్రాసినవి. శ్రీవారికి పాటలు వ్రాయుటలో గల నేర్పు ఆంధ్రులకు ఆబాలగోపాలము తెలిసిన విషయమే. వారు రచియించిన 'గ్రామగానము' మున్నగు పాటలు ఇంకను ముద్రణమునకు వేచియున్నవి. ప్రస్తుతము ప్రచురితమైయున్న దేశీయగీతములు కోరువారెల్లరును ఆగ్రామగానప్రచురణమునకు తోడుపడినవారగుదురు. క్రౌనుసైజున 40 పుటలుగల ఈ గ్రంథము వెల 0—2—0 మాత్రమే. దొరుకుచోటు: ఆంధ్రభూమి బుక్కుడిపో, వేపేరీ, మదరాసు.

## ౧౩౨. బాలసరస్వతి ఆంగ్లో తెలుగు ప్రైమర్

ఆంధ్రబాలురకు ఆంగ్లభాష నేర్పుటకు మిక్కిలి సహాయకారిగ నుండునటుల క్రొత్తపద్ధతులలో వ్రాయబడియున్న ఈ చిన్ని గ్రంథము ప్రాథమికోపాధ్యాయులకు వరణీయమైనదని చెప్పగలను. అచ్చు అక్షరములు వ్రాతఅక్షరములుగూడ బోధించు పాఠములుగలవు. ఈగ్రంథమున మొత్తమునగల ముప్పది రెండు పాఠములలో 320 పదములు క్రొత్తవి నేర్పబడినవి. అందమైన 120 బొమ్మలు పుస్తకమున నిండారియుండి పుస్తకమునందు విద్యార్థికి తఱుగని అభిమానమును కల్గించుచున్నవి. గ్రంథాంతమున ఆంగ్లపదము, అది ఉచ్చరించురీతి, దాని తెనుగు అర్థము వ్రాయబడియుండుట గ్రంథముయొక్క ఉపయోగమును హెచ్చించుచున్నది. కల్యాణదుర్గమునందలి యాట్కిన్ ఇంగ్లీషు స్కూలు మేనేజరైన ఎ. ఈశ్వరయ్యచెట్టిగారిచే రచియింపబడినది. ప్రకాశకులు: టి. బాలనాగయ్యశెట్టి, బాలసరస్వతీ బుక్కుడిపో, కర్నూలు. వెల నాలుగు అణాలు. ఐదుఅణాలు తపాలాబిళ్ళలు పంపినవారికి పుస్తకము పోస్టుద్వారా పంపబడును.

## ౧౩౩. రాయబారము

భారతమున సుప్రసిద్ధమైన సంజయు రాయబారమును, శ్రీకృష్ణురాయబారమును తెనుగు వచనమున రెండు సంపుటములుగా బరంపురమునందలి కళాప్రచారక సమితి కార్యదర్శులగు శ్రీయుత దేవరాజు వేంకటకృష్ణారావుగారు రచయించినారు. వాఁడే వీఁడు, నేనే, కాలూరాయి, విభ్రమరాఘవము మున్నగు గ్రంథముల మూలముగా శ్రీరావుగారు తెనుగువారికి చిరపరిచితులు. అట్టివారి చిరపరిశ్రమకు దివ్యఫలములుగా ఇపుడీరాయబారవిషయకమగు ఈ రెండు గ్రంథములును వెలువడినవి. విశాఖపట్టణమునందలి ఆంధ్రయూనివర్సిటీ కాలేజి తెనుగు చీఫ్ లెక్చరర్ పింగళి లక్ష్మీకాంతంగారీగ్రంథమునకు పీఠిక వ్రాయుచు ఇట్లు నుడివియున్నారు: 'భారతేతిహాసమును తఱచి చదవి అందలి ధర్మసందేహములన్నిటిని విమర్శించి చూచి తేల్చిన సారమీ రచన, దాయభాగవిషయమున, కురుపాండవ పక్షముల వాద ప్రతివాదముల బలమును పరామర్శించి స్వతంత్రుడగు ప్రాడ్వివాకుడు తీర్చినతీర్పిది. ఈరకపు పుస్తకము మనభాషలో సరి క్రొత్త. మఱియు రచనాసరణినిబట్టి చూచినచో నిదియొక నవలయనిపించును. ఇతిహాసగాథను నవలవలె వ్రాయుటయు మనకు క్రొత్తయే. అందునను చదువరుల కబ్బురము దోచు తెరంగున విమర్శన మిముడ్చుట మరియు క్రొత్త. కనుక ఏవిధమున చూచినను ఇది నూత్న వైఖరిని విరాజిల్లు స్వతంత్ర రచనయనక తప్పదు.' రెండు సంపుటములును కలసి 400 పుటలు. వెల రూ. 2—4—0. విడిసంపుటములు వలయుచో ఒక్కొక్కటి రూ. 1—4—0. గ్రంథకర్తయొద్ద వెలకు లభ్యమగును.

## ౧౩౪. సుభాషితరత్నాకరము

నీతిగర్భితములగు గీతపద్యములు. రెండుభాగములుగ ప్రచురితము. ప్రథమభాగము మూడునాలుగు

తరగతులకును, రెండవ భాగము ఐదవతరగతికిని ఉపయోగపడునట్లు శైలీభేదముతో రచియింపబడినది. ఉభయభాషా ప్రవీణులును, బెజవాడ మునిసిపల్ హైస్కూలు తెలుగు పండితులును అగు పింజల సుబ్రహ్మణ్యకవిగారు కర్తలు. ఒక్కొక్క భాగము వెల మూడేసి అణాలు. విద్యాధికులు పలువు రీరచనమును మెచ్చియున్నారు. ఇట్టి గ్రంథపఠనమున బాలబాలికలు ఉత్తమనైతికజీవన మలవఱచుకొనగలరు.

### ౧౩౪. భక్తిసారము

భక్తియోగమును గుఱించిన గ్రంథములసారమే ఈ భక్తిసారము. మోక్షమార్గములు, భక్తిసాధన, సత్సాంగత్యము, సద్గ్రంథపఠనము—ఇత్యాదిగా ఈగ్రంథము ఇరువదియెనిమిది శీర్షికలుగా విభజింపబడిన విషయముతో ఒప్పుచున్నది. ప్రసక్తానుప్రసక్తిగ జొనుపఁబడిన యిందలి పద్యములు, శ్లోకములు పుస్తకముయొక్క విలువను పెంచుచున్నవి. ఈ పుస్తకమును రచియించిన వుప్పల శ్రీరామమూర్తిగారు తరుణవయస్కులయ్యు వ్యసనవివర్జితులనియు విశేషవృద్ధులనియు విందుము. అగుటనే వారిట్టి శుచిప్రాపకమగు పుస్తకమును రచియించిరని తలంతుము. ప్రతులకు కర్తపేర అనకాపల్లి వ్రాయునది.

### ౧౩౫. ఆత్మజ్యోతి.

ప్రపంచప్రఖ్యాతపురుషుడగు కౌంటులియో టాల్స్టాయి మహర్షి రచియించిన 'ఇరువురు యాత్రికులు' అను కథకు ఇది స్వేచ్ఛానుకరణము. కవితాసమితి సభ్యులగు శ్రీముద్దా విశ్వనాథముగారు రచియించినది. 'మానవసేవయే మాధవసేవ' అను ఉత్తమనీతిని ఉద్బోధించు ఉత్తమగ్రంథము. నాలుగు సంవత్సరములలో ఈ పుస్తకము మూడు ముద్రణము లందినదనుచో తెనుగునాట ఇది పొందిన ప్రచారబాహుళ్యమును పోల్చుకొనవచ్చును. మఱియు ఈ తృతీయముద్రణము పాలతెల్లని ఆంటిక్ కాగితముల పై అతిసుందరముగ ముద్రింపబడినది. వెల ఎనిమిది అణాలు. చిరునామా: వ్యాసకుటీరము, మేలుపాక: ఎలమంచిలివరి, విశాఖపట్టణముజిల్లా.

## 1936 కాలెండర్లు

ఆంధ్రభూమి కార్యాలయమునకు అభిమానపూర్వకముగ పంపబడిన ఈ క్రింది కేలండర్లను కృతజ్ఞతాపూర్వకముగ అందుకొంటిమని మనవి. 1. మదరాసునందలి ఆంధ్రపబ్లిషింగుహౌస్ వారి కేలండరు. ఇది 'డెయిలీ టేరాఫ్' కేలండరు. ఇంగ్లీషు తేదీలు స్ఫుటముగ ముద్రింపబడినవి. దిగువను తెనుగు తిథి వార నక్షత్రములు తెలుపబడినవి. ఈ కారణమున ఇది మిక్కిలి ఉపయోగకరమైనదైనది. వెల నాలుగు అణాలు. 2. మదరాసునందలి జయవిజయ ఇన్సూరెన్సుకంపెనీవారి కేలండరు. ఈ కేలండరుపై పూజావ్యగ్ర హృదయయగు నొక స్త్రీ త్రివర్ణచిత్రము ముద్రింపబడి ఆకర్షణీయముగ నున్నది. ఎత్తున దివ్వెకంబముపైనున్న దీపమునందలి వత్తిని ఎగసనద్రోయుచున్న స్త్రీచిత్రము. 3. ఢిల్లియందలి వీనస్ అస్యూరెన్సుకంపెనీవారి కేలండరు. ఇందు ఈ కంపెనీవారు ఇటీవల ఢిల్లియందుకొనిన బ్రహ్మాండమగు భవనముయొక్క పటము ముద్రింపబడియున్నది. 4. పెరిదేపి ఆయుర్వేదసమాజమువారి కేలండరు. ఇందు ఒకసుందరి ఏకవర్ణచిత్రము ముద్రితము.

### వస్తుస్వీకారము

రంగూను తింగాం జూన్ నందు నెలకొనిన నవనీతకుటీరము ప్రొప్రయిటరు శ్రీ పి. కె. దేవరాజులునాయుడుగారు లోపలికితీసుకొనినను పైనపూసినను సర్వరోగముల్ను నివారించుటకు తయారుచేయుచున్న 'నవరత్నరసం'యొక్క మాదిరి బుడ్డిని వందనపూర్వకముగా అందుకొంటిమని మనవి.

Printed at The Andhrabhumi Printing works, Vepery, Madras.
Editor & Publisher: Andra Seshagiri Rao. B.A.